

శ్రీమతే రామానుజాయ నమః
శ్రీమద్వరవరమునయే నమః

# సాంప్రదాయిక వ్యాస మాలిక- ౩౦

2024



పెరియపెరుమాళ్, శ్రీరంగం



'పండితరత్న'
డా|| ఉ. వే. శ్రీమాన్ ఈయుణ్ణి అழగ శింగరాచార్యులు

సమర్పణ: వంగల వేంకట కేశవ అయ్యంగారు

# విషయసూచిక



★★★★★

# సాంప్రదాయిక వ్యాస మాలిక

★★★★★

**శ్రీరామానుజసంప్రదాయకథితానర్థాన్ విధాయాంశకాన్**
**వ్యాసా యే లిఖితా తథైవ కలితా సన్మాలికాకారతః,**
**తే సర్వేఽపి సతాం ముదే సహృదయస్వాంతప్రమోదాయ చ**
**శ్రీమల్లక్ష్మణయోగిరాజ చరణైకోపాయమోదాయ చ.**

భగవద్రామానుజ సంప్రదాయంలో గొప్పవి అయిన అనేకమైన విషయాలను ప్రతిపాదించే అంశాలుగా తీసుకొని ఈ వ్యాసాలు ఒక మంచి మాలికగా రాయబడ్డాయి. ఇవి అన్ని సత్పురుషుల ఆనందానికి సహృదయ మనస్సులలో గొప్ప సంతోషానికి భగవద్రామానుజుల వారి చరణాలే అద్వితీయమైన ఉపాయం అనే భావించే వారికి కూడా ఆనందాన్ని కలిగించాలి.



# కాలశక్కరత్తాన్

★★★

ఈ బ్రహ్మాండంలో కాలతత్వం అనేది ముందుకు వెళ్లే గతిని కలిగినది. ఇది ఆ తత్వానికి కల సహజ ధర్మం. మనకు తెలిసి ఏ సమయంలోనూ కాలం వెనక్కు వెళ్లిన సందర్భాలు తెలియవు. "కాలం ఎల్లప్పుడూ ముందుకు వెళ్లే గతిని కలిగి ఉండాలి" అనే ఒక నియమాన్ని భగవానుడే ఏర్పరచాడు. ఏ బ్రహ్మాండంలోని ఉండే ఏ వ్యవస్థ అయినా, అది భగవానుడు చేసిన కట్టడియే కదా.

కానీ, భగవానుడు ఆవశ్యకమైతే, తన భక్తుల కోరికను తీర్చడం కోసం తానుఏర్పరిచిన వ్యవస్థను కూడా కాదని, దానిని మార్చే స్వభావాన్ని కలిగినవాడు. భక్తుని కోరికను తీర్చడం కోసం తన మాటను, తాను ఏర్పరిచిన వ్యవస్థను కూడా అతిక్రమించి వర్తించే భక్త వాత్సల్యాన్ని, సౌలభ్యాన్ని కలవాడు, అతడు.

దీనికి ఉదాహరణం ఏమంటే, "నేను ఆయుధాన్ని పట్టను" అని చేసిన ప్రతిజ్ఞను, శ్రీకృష్ణ భగవానుడు, "నేను ఏ విధంగానైనా సరే కృష్ణుని చేత ఆయుధం పట్టేటట్లు చేస్తాను" అనే పరమ భక్తుడైన భీష్ముడు పలికిన మాటను నిజం చేయడం కోసం, చక్రాయుధాన్ని పట్టిన సందర్భం భారత యుద్ధంలో మనకు కనిపిస్తుంది.

ఈ విధంగానే, "కాలం ముందుకు వెళ్లే తత్వం" అని తాను ఏర్పరిచిన నియమాన్ని కూడా కాదని, ఆ కాలాన్ని, పరమ భక్తులైన నమ్మాళ్వార్లను అనుగ్రహించడం కోసం, వెనుకకు వెళ్లేటట్లు చేసిన సందర్భం ఒకటి తిరువాయ్ మొళి దివ్య ప్రబంధంలో గోచరిస్తుంది. తన భక్తుడైన అర్జునుని

అనుగ్రహించడం కోసం కాలాన్ని ముందుకు, వెనుకకు నడిపిన వేరొక సందర్భం మహాభారతంలో కనిపిస్తుంది.

మొదటి సందర్భం, తిరువాయ్ మొళి ప్రబంధంలోని నాలుగవ శతకం మూడవ దశకంలో దర్శనమిస్తుంది. ముందుగా దీని నేపథ్యాన్ని కొంచెం గమనిద్దాం.

ఈ ప్రబంధంలోని నాలుగవ శతకం "పాలనాయ్ " అనే రెండవ దశకంలో ఆళ్వార్లు అనుగ్రహించిన పాశురాలు అన్నీ చాలా విలక్షణమైనవి. ఈ దశకంలోని పాశురాలు పరాంకుశ నాయకి తల్లి పలికే పాశురాలుగా దర్శనమిస్తాయి. ఈ పాశురాలు అన్నిటిలోనూ, పరాంకుశనాయకి భగవానుడు వేరు వేరు సందర్భాలలో అలంకరించుకున్న తులసిని తాను పొందాలని ఆశపడుతున్నట్లుగా తల్లి పలుకుతున్నది.

మొదటి పాశురంలో, భగవానుడు, వటపత్ర శాయి దశలో చరణాలకు అలంకరించుకున్న తులసిని, రెండవ పాశురంలో రేపల్లెలో గోపికలతో పాటు శ్రీకృష్ణుడు రాసక్రీడ ఆడినప్పుడు అతడు పాదాలకు ఆభరణంగా అలంకరించుకున్న తులసిని, మూడవ పాశువర్లలో సనకసనందనాదులు తాము భగవదారాధన చేసే సమయంలో భగవానుని చరణాలకు అలంకరించిన తులసిని, నాలుగవ పాశురంలో పరమపదంలో ఆ స్వామి తన పాదాలకు అలంకరించుకున్న తులసిని, ఐదవ పాశురంలో శ్రీకృష్ణావతార సమయంలో కుంభనృత్యాన్ని చేసినప్పుడు స్వామి తన పాదాలకు అలంకరించుకున్న తులసిని, ఆరవ పాశురంలో వరాహమూర్తి భూదేవిని ఉద్ధరించినపుడు ఆ స్వామి పాదాలకు అలంరించుకున్న తులసిని, ఏడవ పాశురంలో పాల సముద్రాన్ని చిలికినప్పుడు, అందులో ఉద్భవించిన

శ్రీదేవిని భగవానుడు తన వక్షస్సుపై పెట్టుకున్నపుడు అతడు తన పాదాలకు అలంకరించుకున్న తులసిని, ఎనిమిదవ పాశురంలో సీతాదేవి కోసం లంకను దగ్ధం చేసిన శ్రీరామచంద్రుడు తన పాదాలకు అలంకరించుకున్న తులసిని– ఈ విధంగా వేరు వేరు సందర్భాలలో భగవానుడు తన పాదాలతో అలంకరించుకున్న తులసిని ప్రసాదంగా పొందాలని పరాంకుశ నాయకి ఆశపడుతున్నదని ఆమె తల్లి చెప్పినది. ఈ దశకంలో చివర ఉండే మిగిలిన రెండు పాశురాలలో కూడా భగవానుడు అలంకరించుకున్న తులసిని నాయకి ప్రసాదంగా పొందాలని ఆశపడుతున్నట్లుగా తల్లి చెబుతున్నది. ఈ దశకంలోని చివరి పాశురంలో కూడా, తన కుమార్తె ఆశపడినట్లుగా భగవదనుగ్రహాన్ని పొందలేనందు వల్ల ఆమె చాలా ఆర్తిని పొందిందని తల్లి పలుకుతున్నది.

**ఇటువంటి చాలా ఆర్తిని పొందిన దశలో ఉండే అళ్వార్లు**

తర్వాతి దశకంలో తమ ఆర్తిని తెలియజేస్తూ ఉండే పాశురాలనుకదొ పాడి ఉండాలి. కానీ, తరువాత గల " కోవైవాయాళ్"అనే దశకంలో ఉండే దశకాలు పాశురాలు ఆళ్వార్లు ఎంతో తృప్తితో పలికే పాశురాలుగా కనిపిస్తున్నాయి. ఇది ఏ విధంగా సంగతం అవుతున్నది? అనే సందేహం కలుగుతుంది కనుక, దీనికి తగిన సమాధానాన్ని తిరుమల నంబి అనే ఆచార్యులు, ఎంబార్ అనే ఆచార్యులు, పరాశర భట్టర్ అనే ఆచార్యులు, ముగ్గురు మూడు విధాలయిన వివరణలతో తెలిపారు. ఈ మూడిటిలో ప్రస్తుతం ప్రసావించదగిన వివరణ భట్టర్ అనుగ్రహించిన వివరణ కనుక అది ఇక్కడ ప్రస్తావింపబడుతున్నది. ఇది మిగిలిన రెండు వివరణల కంటే పరమరస్యంగా ఉండడం కూడా ఇక్కడ గమనించదగినది.

ఈ సమాధానాన్ని భట్టర్ ఆళ్వార్ల సూక్తిని పురస్కరించుకునే నిర్వహించారు. ఈ దశకంలోని ఐదవ పాశురంలో ఆళ్వార్లు భగవంతుని ఉద్దేశించి "కాలశక్కరత్తాన్! " అనే ఒక విశేషణాన్ని ప్రయోగించారు. దీని అర్థం ఏమంటే, " కాలచక్రాన్ని అధీనంలో కలిగినవాడు!" అని అర్థం. కాలమనేది చక్రస్వభావాన్ని, అనగా పరిభ్రమించే స్వభావాన్ని కలిగినది. ఒక దినం తరువాత వేరొక దినం, ఒక పక్షం తరువాత వేరొక పక్షం, ఒక మాసం తరువాత వేరొక మాసం, ఒక అయనం తరువాత వేరొక అయనం, ఒక సంవత్సరం తరువాత వేరొక సంవత్సరం, ఒక యుగం తర్వాత వేరొక యుగం, ఒక కల్పం తరువాత వేరొక కల్పం అని ఈ విధంగా మాటిమాటికి ముందుకు పరిభ్రమించే స్వభావాన్ని కలిగినది. కనుక, కాలం ముందుకు దొరలే స్వభావాన్ని కలిగిన చక్రస్వరూపంగా నిర్దేశింపబడుతున్నది. అటువంటి కాలతత్వాన్ని నిర్వహించే చక్రాన్ని నిర్వహించేవాడు భగవానుడే కదా. భగవానుడు చక్రపాణి.

ఈ కాలచక్రం సుదర్శనాత్మకమైనది. వేదాంతదేశికులు శ్రీసుదర్శన భగవానుని వైభవాన్ని తెలియజేసే షోడశాయుధ స్తోత్రంలోని మొట్టమొదటి శ్లోకంలో " కాలచక్రం చ శాశ్వతమ్" అని కాలస్వరూపునిగా సుదర్శనుని స్తోత్రం చేశారు. అందువల్ల, భగవానుడు తన చేతిలో సుదర్శన చక్రాన్ని ధరించడం ద్వారా, " నేను నా అధీనంలో కాలతత్వాన్ని నిర్వహించే సుదర్శనుని నా అధీనంలో కలిగినవాడను" అనే తత్వాన్ని వ్యక్తం చేస్తున్నాడు. అందుచేత ఇక్కడ ఆళ్వారుల చేసిన "కాలశక్కరత్తాన్" అనే విశేషణానికి " చక్రరూపంలో ఉండే కాలాన్ని అధీనంలో కలిగినవాడా!" అని తాత్పర్యం.

అయితే, ఆళ్వార్లు ప్రస్తుతంలో ఈ పదప్రయోగాన్ని ఎందుకు చేశారు? అనే విషయాన్ని కూడా ఇక్కడ కొంచెం లోతుగా గమనించాలి. ఈ పదమే ప్రస్తుతంలో కలిగే సందేహానికి సమాధానం చెబుతున్నది – అని భట్టర్ అభిప్రాయం.

పరాంకుశ నాయకి గత దశకంలో తాను పొందాలని ఆశపడిన తులసి ప్రస్తుతంలో సామాన్య క్రమంలో లభించే అవకాశం లేదు ఎందుకంటే, ఆమె కోరిన తులసి సృష్టి ప్రారంభం అవడానికి ముందుగా ప్రళయ సముద్రంలో మఱ్ఱి ఆకు పడుకపై శయనించి ఉండే వటపత్ర శాయి స్వామి తన పాదాలకు అలంకరించుకున్న తులసిని, అదేవిధంగా, ఎప్పుడో జరిగిన వామనరామ కృష్ణాది అవతారాలలో భగవానుడు తన చరణాలకు అలంకరించుకున్న తులసిని పొందాలని ఈమె ఆశపడుతున్నది. కాలతత్త్వం ముందుకు సాగే ఈ బ్రహ్మాండంలో అది ఏ విధంగా సాధ్యం అవుతుంది? సాధ్యం కానందు వల్ల నాయకి మనసులోని ఆతృప్తి, ఆర్తి అతిశయించింది.

అళ్వార్ నాయకి మనస్సులో ఉండే ఈ అతృప్తిని, ఆర్తిని భగవానుడు తీర్చాలని సంకల్పించాడు. కానీ, కాలం అనేది ముందుకే వెళ్లే స్వభావాన్ని కలిగినది అనే నియమాన్ని పూర్వం వలె కొనసాగించినట్లయితే, కోరిక తీరే అవకాశం లేదు. అందువల్ల, తాను సామాన్యంగా విధించిన "కాలం ముందుకు వెళ్లే స్వభావాన్ని కలిగిన తత్వం" అనే నియమాన్ని తాత్కాలికంగా మారాలి– అనే సంకల్పాన్నిశ తాత్కాలికంగా చేశాడు. ఎప్పుడో, ఆయా సమయాలలో తాను తన పాదాలకు అలంకరించుకున్న తులసిని ఆళ్వార్లు సాక్షాత్తుగా దర్శించి, ఆనందించి, అనుభవించేటట్లు చేశాడు. ఆళ్వార్లకు తృప్తి కలిగింది,

ఆర్తి తీరింది. ఆ తృప్తితో అనంతర దశకంలో ఉండే పాశురాలను అనుగ్రహించారు. ఇది భట్టర్ వారు చేసిన సమన్వయం.

తరువాతి దశకంలో పాశురాలను అనుగ్రహించేటప్పుడు, ఆళ్వార్లు, తమ ఆశ తీరేటట్లుగా భగవానుడు చేసిన ఈ ఉపాయాన్ని సూచిస్తూ "కాలశక్కరత్తాన్!" అనే సాభిప్రాయకమైన ఒక విశేషణ ప్రయోగాన్ని అయిదవ పాశురం చివర చేశారు– అన భట్టర్ అభిప్రాయపడి, తదనుగుణమైన వివరణను ఇక్కడ అనుగ్రహించారు.

భగవానుడు ఏ విధంగా ఆళ్వారుల కోరికను తీర్చాడు? అంటే, పురోగమనాన్ని స్వభావంగా కలిగిన సుదర్శనాన్ని ఒక క్షణకాలం స్వామి తిరోగమన స్వభావాన్ని కలిగినదానినిగా తన సంకల్పం ద్వారా చేశాడు. చక్రం వెనుకకు తిరిగేటట్లు చేశాడు. దాని పర్యవసానంగా, ఎప్పుడో జరిగిన సంఘటనలను వస్తువులను సాక్షాత్తుగా దర్శించడానికి, ఆనందించడానికి అవకాశం ఆళ్వారులకు ఏర్పడింది. ఆ అనుభవం వల్ల వారి మనసులోని ఆర్తి తీరి, సంతృప్తి కలిగింది.

ఈ సందర్భంలో ఈడు వ్యాఖ్యాన సూక్తి, దానిని వివరించే అరుంబద వివరణం ఈ విషయాన్ని సూచిస్తున్నది. ఆళ్వారులు చేసిన "కాల శక్కరత్తాన్" అనే ప్రయోగానికి భట్టర్ చేసిన వివరణను వ్యాఖ్యాత నంబిళ్ళై వివరిస్తూ" కాలశక్కరత్తానాకైయాలే కాలోపాధియై క్కழித్తు, వర్తమాన కాలత్తిల్ పోలే అనుభవయోగ్యమామ్బడి కాలత్తై ఒరుపోకి యాక్కి కొడుక్క అనుభవిక్కిఱార్– ఎన్ఱు అరుళిచ్చెయ్ వర్" (భగవానుడు, కాలతత్వాన్ని నిర్వహించే సుదర్శన చక్రాన్ని తన స్వాధీనంలో కలిగినవాడు కనుక, కాలోపాధిని తొలగించి, వర్తమాన కాలంలోవలె గతంలో ఉండే వస్తువులను

కూడా అనుభవానికి సాధ్యమయ్యేటట్లుగా ఉండేటట్లు కాలస్వభావాన్ని మార్చి, అనుభవింపజేయగా, అనుభవిస్తున్నారు – అని భట్టర్ అన్నారు) అని అన్నారు.

ఈ వివరణంలోని తాత్పర్యం ఏమంటే, ఈ లోకంలో ఉండే అనుభవం అనేది కాలాన్ని ఉపాధిగా కలిగినది. అంటే, ఏ వస్తువు యొక్క అనుభవం అయినా, ఆ వస్తువు ఉన్న కాలంలో జీవించినవారికే ఆ వస్తువు అనుభవం కలిగే అవకాశం ఉన్నది. ఆ వస్తువు యొక్క అస్తిత్వం, అంటే, సత్త లేకుండా పోయిన తరువాత, దాని అనుభవాన్ని పొందడానికి ఎవరికీ సాధ్యం కాదు. అందువల్ల, ఒక వస్తువు యొక్క అనుభవం అనేది కాలం పై ఆధారపడి ఉన్నది. కాలాన్ని ఉపాధిగా కలిగి ఉన్నది. ఇది భగవంతుడు ఏర్పడిన కాలవ్యవస్థ. ఈ కాలవ్యవస్థను మార్చదలచిన భగవానుడు, ఈ వ్యవస్థకు నియామకుడైన సుదర్శనుని గమనాన్ని వేరు విధంగా ఉండేటట్లు తాత్కాలికంగా తన సంకల్పంతో నియమించాడు. అంటే, తాత్కాలికంగా చక్రం వెనుకకు తిరిగేటట్లు చేశాడు. అప్పుడు, అళ్వార్లకు, ఎప్పుడో, వేరు వేరుశ భూతకాలాలలో ఈ విభూతిలో ఉన్నది, ప్రస్తుతం లేనందున, అనుభవ దూరమై ఉండేది అయిన తులసియొక్క అనుభవం ఆళ్వార్లకు కలిగే అవకాశం కలిగింది.

ఇక్కడ ఇంకో విషయం కూడా ఉన్నది. అది ఏమంటే, అళ్వార్లకు కలిగిన ఈ అనుభవం అందరికీ కలగాలి కదా. ఆ విధంగా కలిగినట్లు కనిపించలేదే? కలిగినట్లుగా ఎవరు తెలియజేయలేదే? అనే సందేహం కలుగవచ్చు. అయితే, ఇక్కడ, భగవానుడు కాలం వెనక్కు తిరిగేటట్లుగా చేయడం ద్వారా దాని స్వభావాన్ని మార్చినట్లుగానే, ఆ విధంగా మార్చడం

ద్వారా కలిగే ఆ అనుభవం కేవలం ఆళ్వార్లకు మాత్రమే కలగాలి– అనే ఇంకొక సంకల్పాన్ని కూడా చేశాడు. భగవానుడు సత్యసంకల్పుడు కదా. అందువల్ల అతడు సంకల్పించినట్లుగా, కాల తత్వం తిరోగమనాన్ని కలిగనపుడు ఏర్పడే అనుభవం ఆళ్వారుల విషయంలో మాత్రమే సంభవించింది.

దీనికి పూర్తిగా మారుగా, కాలం, సహజంగా ఉండే వేగతో కంటే, మరింత వేగంతోళ ముందుకు సాగిన సందర్భం, అప్పుడు కలిగిన అనుభవం ఒక్కరికి కాకుండా అందరికీ కలగడం – అనే సన్నివేశాన్ని కూడా వేరొక సమయంలో, భగవానుడు తన చేతిలో ఉండే కాలతత్వాత్మకమైన చక్రం ద్వారా నిర్వహించాడు. దానిని "కాలశక్కరమ్" అనే పదాన్ని వివరిస్తూ నమ్బిళ్ళై ఉదాహరించారు కూడా. వారి వ్యాఖ్యానంలో ఈ పదం "పగలై ఇరవాక్క వల్లవనిఱే" (పగలును రాత్రిగా చేయగలిగినవాడుకదా) అని వివరింపబడింది. అంటే, కాలతత్వ నిర్వాహకుడైన సుదర్శనుడు పగటి కాలాన్ని కూడా రాత్రిగా చేయగలిగినవాడుకదా– అని అర్థం.

ఈ సందర్భం భారత యుద్ధ సమయంలో సంభవించింది. తన కుమారుడైన అభిమన్యుని మరణానికి కారణమైన జయద్రథుని సూర్యుడు అస్తమించేలోగా వధిస్తానని, లేకపోతే ప్రాణ త్యాగాన్ని చేస్తానని అర్జునుడు ప్రతిజ్ఞ చేసినందున, తన భక్తుడైన అతనిని రక్షించడం కోసం భగవానుడు తన చేతిలో ఉండే కాలతత్వనిర్వాహకుడైన సుదర్శనుని ప్రయోగించాడు. సుదర్శన చక్ర ప్రభావం వల్ల, తాత్కాలికంగా రాత్రి కాలం అయినట్లు అందరికీ కనిపించింది. అప్పుడు జయద్రథుడు బయటికి వచ్చి, తల ఎత్తి చూడగానే, అపుడు, శ్రీకృష్ణుని ఆజ్ఞపై శిరస్సు ఖండించి అతనిని వధించాడు. ఈ వృత్తాంతం భారతంలో ప్రసిద్ధమైనది.

ఇక్కడ, పగటికాలం రాత్రిగా అందరికీ గోచరం కావడానికి శ్రీకృష్ణ భగవానుడు చేసిన సంకల్పమే కారణం. సహజంగా ముందుకు వెళ్లే వేగం

కంటే మరింత వేగంగా సుదర్శనుడు ముందుకు పరిభ్రమించేటట్లుగా, కాలం సహజంగా ముందుకు వెళ్లే వేగం కంటే, మరింత వేగంగా ముందుకు వెళ్లేటట్టుగాన భగవానుడు సంకల్పించగా, ఆ సంకల్పాన్ని సుదర్శనుడు నిర్వహించాడు. దాని ఫలంగా అందరికీ రాత్రి అయినట్లు కనిపించింది. సైంధవ వధ జరిగింది.

మళ్లీ భగవానుడు కాలగమనాన్ని నిర్వహించే సుదర్శన చక్రపు భ్రమణ వెనుకకు జరగాలని వేరొక సంకల్పాన్ని చేశాడు. ఆ సంకల్ప ఫలంగా సుదర్శనుని గమనం వెనుకకు వెళ్ళినది. మళ్ళీ, అందరికీ అదే పగటి కాలంగా తోచింది.

ఈ విధంగా ఒకే సందర్భంలో కాలతత్వ నిర్వాహకుడైన సుదర్శన చక్రం ద్వారా భగవానుడు కాలాన్ని ముందు వెనుకలకు నడిపాడు.



# వేదమ్ తమిఴ్శెయ్ద మాఱన్

★★★

(శ్రీమాన్ ఎస్ కృష్ణ స్వామి అయ్యంగారి స్వామి వారీ శ్రీ విష్ణు సూక్త వ్యాఖ్యానం ఆధారంగా)

★★★

తిరువాయ్ మొళి దివ్య ప్రబంధంలోని ఎన్నో పాశురాలు వేదంలోని మంత్రాలలో తెలుపబడిన అర్థాలను అనుసంధిస్తున్నాయి. దానికి నిదర్శనంగా ఒక సందర్భాన్ని గమనిద్దాం.

ఈ క్రింది మంత్రం యజుర్వేదంలోని రెండవ అష్టకం నాలుగవ ప్రశ్నలో ఉన్నది.

**తమస్య రాజా వరుణ స్తమశ్వినా**
**క్రతుం సచంత మారుతస్య వేధసః॥**
**దాధార దక్ష ముత్తమ మహర్విదం**
**వ్రజం చ విష్ణుః సఖివాం అపోర్ణుతే॥**

ముందుగా, ఈ మంత్రంలోని అర్థాన్ని గమనిద్దాం.

"సాధనాలు సాక్షాత్తు ఫలాన్ని ఇచ్చేవి కావు. భగవానునకు ప్రీతిని కల్గించడం ద్వారా ఐహికాముష్మిక ఫలాలను ఇచ్చేటట్లు చేస్తున్నాయి. సర్వరక్షకుడైన అతడే ఐహిక ఫలాలను, పారలౌకిక ఫలాలను ఇస్తున్నాడు"- అని ఈ మంత్రం తెల్పుతున్నది.

సర్వరక్షకుడై ఉండేవాడే సకలఫలప్రదుడై ఉండ గలడు కనుక, ఈ భగవంతుడే సకల చేతనులను రక్షిస్తున్నాడు– అనేది ఈ మంత్రంలోని పూర్వార్థతాత్పర్యం. ఇతడే సర్వరక్షకుడనే విషయాన్ని–

వేదమ్ తమిళ్ళశెయ్ ద మాఱన్

**న హి పాలన సామర్థ్యమృతే సర్వేశ్వరం హరిమ్,**

**స్థితౌ స్థితం మహాప్రాజ్ఞ! భవత్యన్యస్య కస్యచిత్**

(ఓ మహాబుద్ధిమంతుడా! రక్షణలోనిలకడగా ఉండే, సర్వేశ్వరుడైన హరికి తప్ప వేరెవ్వరికి రక్షించడంలో సామర్థ్యంలేదు కదా) అని శ్రీవిష్ణుపురాణంలో శ్రీపరాశరమహర్షి,

**"ఏ పావమ్ పరమే ఏళ్ళులకుమ్ ఈపావమ్ శెయ్ దు అరుళాల్ అళిప్పారార్?"**

(ఏమి పాపం! ఏడు లోకాలను రక్షించేవారు శ్రీమన్నారాయణుని కంటే వేఱెవ్వరున్నారు?). అని శ్రీపరాంకుశులు వివరించారు.

(మారుతస్య)– మరుద్గణాలకు – – దేవగణాలకు – అని భావం.

(వేధసః)– స్రష్ట అయిన వానియొక్క –దేవతలను సృష్టించినవానియొక్క– అని భావం.

**"నాట్టై ప్పడై యెన్ఱు అయన్ ముదలా త్తన్ద నళిర్ మామలరున్ది**

**వీట్టై ప్పణ్ణి విళైయాడుమ్ విమలన్"**

("లోకాలను సృష్టించు" అని బ్రహ్మమొదలైన ప్రజాపతులను సృష్టించిన, చల్లని గొప్ప పద్మాన్ని కల నాభి అనే గృహాన్ని సృష్టించి, లీలారసాన్ని అనుభవించే పావనుడైనవానిని) యొక్క– అని సారం. లేక,

(మారుతస్య)– మరుత్తులు అనబడే దేవతలతో సంబంధాన్ని కలవానియొక్క– అని అర్థం. వారి స్వల్పమైన ఆనుకూల్యాన్నే చూచి, వారు తనను ఆశ్రయించినవారుగా భావించేవానికి– అని భావం.

**దేవానాం దానవానాం చ సామాన్య మధిదైవతమ్** (జితంతే–1)

(దేవతలకు, దానవులకు సామాన్యమైన దైవం నీవు) అనేవిధంగా అందఱికి చెందిన (సామాన్యమైన) "పొదునిన్ఱ పొన్నమ్ కళ్ళల్" (సర్వసాధారణమైన, అందమైన బంగారు శ్రీచరణాలు) కల్గినవాడైనా,

ఆనుకూల్యలేశాన్ని కలవారి పట్ల అంతు లేని పక్షపాతాన్ని కలవాడై ఉంటాడు. పరస్పర విరుద్ధమైన ఈ రెండు ఏవిధంగా పొసగుతాయి? అంటే,

**"సమోఽహం సర్వభూతేషు న మే ద్వేష్యోఽస్తి కశ్చన"**

(నన్ను ఆశ్రయించే విషయంలో నేను అందటికి సమానమై ఉంటాను. నాకు గర్హించదగినవాడెవడూ లేడు) అనేవిధంగా తనను ఆశ్రయించే విషయంలో అందటికి సమానంగా ఉండేవాడు కనుక, "పొదు నిన్ఱ కழల్" (అందటికి సాధారణమైన శ్రీచరణం) అనేదికూడా పొసగుతుంది. ఆశ్రయించిన తరువాత వారిపట్ల ఆశ్రయించని వారిపట్ల కంటే ప్రేమ అతిశయించి ఉండడం కూడా మిక్కిలి పొసగుతుంది.

(వేధసః) – ఈ రెండవ నిర్వాహంలో " వేధసః" అంటే– సర్వస్రష్ట అయినవానియొక్క– అని అర్థం.

(అస్య) – సుప్రసిద్ధ రక్షకుడైన ఈ విష్ణువుయొక్క– అని అర్థం. అకారవాచ్యుడైన విష్ణువుయొక్క –అని కూడా అర్థం. "అ ఇతి బ్రహ్మ" (అకారం పరబ్రహ్మను తెల్పుతుంది), "అకారార్థో విష్ణుః" (అకారానికి అర్థం విష్ణువు) అని శ్రీపరాశరభట్టరుల సూక్తి.

**"తస్య ప్రకృతిలీనస్య యః పరః స మహేశ్వరః" (తైత్తి–నారా)**

(తన కారణమైన అకారంలో అంతర్భవించిన ఓంకారానికి అర్థం గొప్ప ఈశ్వరుడైన ఆ నారాయణుడే) అని,

**"అక్షరాణా మకారో ఽ స్మి"** (గీత–10–33) (అక్షరాలలో అ అనే అక్షరాన్ని నేను)అని,

**"అ ఇతి భగవతో నారాయణస్య ప్రథమాభిధానమ్"** (మహాభాష్యమ్)–

("అ" అనేది భగవంతుడైన నారాయణుని మొదటి నామం) అనేవిధంగా, అకారవాచ్యుడు ఇతడే– అనేది సుప్రసిద్ధం కదా! "అవ–రక్షణే"

అనే ధాతువునుండి పుట్టినది అయినందున, "వీరిని రక్షిస్తాడు, ఈ దేశంలోనే రక్షిస్తాడు"- అనే నియమం చేయబడనందున, సర్వదేశ సర్వకాల సర్వావస్థలలో అందఱిని రక్షించేవాడు– అనేది అకారానికి అర్థం.

(వేధసః అస్య) – సర్వకారణుడైన అకారవాచ్యునియొక్క –అని అర్థం. "ప్రకృతిలీనస్య" అనేవిధంగా, వాచకాలైన అన్ని అక్షరాలకు కారణమైన అకారానికి వాచ్యుడే వాచ్యాలన్నిటికి కారణమని ఇక్కడ తెలుపబడింది.

"ప్రకృతిలీనస్య యః పరః స మహేశ్వరః" (అక్షరకారణమైన అకారానికి అర్థమైనవాడే సర్వకారణుడు) అని వేదం తెలిపింది కదా!

(అస్య తం క్రతుమ్)– సర్వరక్షకుడైన ఆ రక్షణకార్యాన్ని,

(రాజా వరుణః సచంత)– ప్రకాశించే వరుణుడు పొందుతున్నాడు– అని అర్థం. లోకాన్ని అంతటిని ఆర్ద్రహస్తంతో స్పృశిస్తాడు కనుక, సుప్రసిద్ధరక్షకుడుగా ప్రకాశించే వరుణుడు పొందుతున్నాడు. వరుణుని వద్ద ఉండే రక్షణకార్యం పరమపురుషునిదే– అని ఇక్కడ భావం.

(రాజా వరుణః) – ప్రకాశించేవాడైన వరుణుడు– అని అర్థం. ఇక్కడ ప్రకాశమంటే– భగవానునిచే విశేషించి అభిమానింపబడడం. అంటే, "**ఆழிమழை క్కణ్ణా!**" అనేచోట తిరుప్పావై వ్యాఖ్యానంలో–

"సృష్టిసంహారఙ్గళై బ్రహ్మారుద్రర్ తలైయిలే పొకట్టు, స్వరూపత్తుక్కు చ్చేర్ న్ద పాలనవిధియై త్తాన్ నడత్తుమాపోలే, నాట్టారై క్కట్టువదు, విడువదాకిఱ క్రౌర్యవ్యాపారత్తై యమాదికళ్ తలైయిలే ఏఱిట్టు, తమ్మోపాది ఈరక్కైయాలే తడవిక్కొడుక్కవల్లన్ – ఎన్ను ఈశ్వరనాలే మదిక్కప్పట్టవనల్లైయో, నీ!"

(సృష్టి, సంహారాలను బ్రహ్మ, రుద్రులకు అప్పగించి, తన స్వరూపానికి తగిన పాలన విధిని తాను నిర్వహించేటట్లుగా, లోకాలను బంధించడం, విడువడమనే క్రూరవ్యాపారాన్ని యమాదులకు అప్పగించి, నా వలె ఇతడు చల్లని చేతితో లోకాలను స్పృశించగలడు – అని భగవానునిచే

గౌరవింపబడినవాడవు కదా, నీవు) అని వ్యాఖ్యానచక్రవర్తి పెరియవాచ్చాన్ పిళ్ళై అనుగ్రహించిన రీతిలోనే, ఆ భగవంతునిచే కూడా అభిమానింపబడడమనే గొప్పతనాన్ని తెల్పుతున్నది.

లేక, "ఆழிమழைక్కణ్ణా!" అని గోదాదేవి పల్కినట్లే, గంభీరమైన స్వభావాన్ని కలవాడై, వృష్టికి నిర్వాహకుడై ఉండే గొప్పతనాన్ని తెల్పుతున్నదని కూడా చెప్పవచ్చు.

(తమశ్వినా) – ఆ రక్షణకార్యాన్నే దేవవైద్యులుగా ప్రసిద్ధి పొందిన అశ్వినీదేవతలు కూడా పొందుతున్నారు. వర్షం కురిసి, ఈ లోకాన్ని రక్షించేవాడైనందున వరుణుని, వైద్యం చేసి దేవలోకాన్ని రక్షించేవాడైనందున అశ్వినీదేవతలను ప్రార్థించడం– మిగిలిన లోకంలో కన్పించే రక్షకులందఱికి ఉపలక్షణం. లోకంలో రక్షకులుగా చెప్పబడేవారిలో ఉండే రక్షణధర్మమంతా ఇతనిదే– అని భావం.

రాజు అయిన వరుణుడు, అశ్వినీదేవతలు భగవంతుని రక్షణకార్యాన్ని (ధర్మాన్ని) పొందుతున్నారు– అని అనడం వారుకూడా అతని రక్షణ కార్యానికి విషయం అవుతున్నారనే అర్థాన్ని తెల్పుతున్నది, రక్షకులుగా భావింపబడే దేవతలు కూడా అతనికి రక్ష్యభూతులు. కనుక, "సర్వరక్షకుడు అతడే–" అని నిర్ణయిస్తున్నదని కూడా చెప్పవచ్చు.

లేక, వేఱు రీతిలో కూడా అర్థాన్ని చెప్పవచ్చు.

(మారుతస్య)– వైద్యులైన ఋత్విక్కుల సమూహాన్ని కలవానియొక్క అని, లేక, దేవతలతో సంబంధాన్ని కలవానియొక్క– అని అర్థం. దీని అర్థమేమంటే–

**"దేవాన్ భావయతాఽనేన తే దేవా భావయంతు వః,**
**పరస్పరం భావయంతః శ్రేయః పర మవాప్స్యథ"** (గీత)–

వేదమ్ తమిழ్శెయ్ ద మాఱన్

(దేవతలను యజ్ఞాలతో ఆరాధించండి. ఆ దేవతలు కూడా వర్షం మొదలైన వానితో లోకాలను తృప్తిపరిచెదరుగాక! ఈ విధంగా ఒకరికొకరు తృప్తిని కల్గించుకొంటూ గొప్ప శ్రేయస్సును పొందండి) అని చెప్పబడిన సంబంధాన్ని కలవానియొక్క –అని అర్థం.

(వేధసః అస్య)– మేధావి అయిన ఈ యజమానుని యొక్క,

(తం క్రతుమ్)– ప్రసిద్ధమైన యజ్ఞాన్ని– యజ్ఞస్వరూపి అయిన విష్ణువును –అని అర్థం. "యజ్ఞో వై విష్ణుః" అని వేదంలో అధ్యయనం చేయబడుతున్నది కదా!

(వరుణః –అశ్వినా –సచంతే)– వరుణుడు, అశ్వినీదేవతలు మొదలైన దేవతలందఱు సేవిస్తున్నారు. ఇక్కడ వరుణుని, అశ్వినీదేవతలను ప్రస్తావించడం– –అష్టవసువులు, ఏకాదశరుద్రులు, ద్వాదశాదిత్యులు మొదలైన సకలదేవతలకు ఉపలక్షణం.

**ఎణ్మర్ పదినొరువర్ ఈరఱువర్ ఓరిరువర్**
**వణ్ణ మలరేన్ది వైకలుమ్– నణ్ణి ఒరు మాలైయాల్**
**పరవి ఓవాదు ఎప్పొழுదుమ్**
**తిరుమాలై క్కైతొழுవర్ శెన్ఱు (ముదల్ తిరు–52)**

(అష్టవసువులు, ఏకాదశరుద్రులు, ద్వాదశాదిత్యులు, అశ్వినీదేవతలు– అనే వీరు మంచి రంగును కల పూలను తీసికొని, ప్రతిదినం ఆశ్రయించి, ఒక వరుసగా నిలచి, ఎల్లప్పుడు శ్రియఃపతికి అంజలి ఘటిస్తారు) అని పొయ్ గై అళ్వార్లు అనుగ్రహించారు కదా! ఈ విధంగా ఇంతవరకు, యజ్ఞస్వరూపియైనవాడై రక్షించేవాడితడే– అని ఉద్ఘోషింపబడింది.

ఈ మంత్రం పూర్వార్ధంలో ఇతడే సర్వరక్షకుడనే అర్థం తెలుపబడింది. ఇతడు రక్షించడం ఏ విధంగా? అంటే, ఇహలోక

పరలోకప్రయోజనాలను అనుగ్రహించడం ద్వారా రక్షిస్తున్నాడు– అని ఇక తెలుపబడుతున్నది.

(దాధార దక్షమ్) – బలాన్ని ధరిస్తున్నాడు– అని అర్థం. మోక్షఫలప్రదత్వ సామర్థ్యం ఇక్కడ బల మనబడుతున్నది. అనాదికాలంగా సంసారంలో ఉండే జీవుని ప్రకృతిసంబంధాన్ని రుచివాసనలతో సహితంగా పోగొట్టడం సామాన్యమైన పని కాదు కదా!

**"దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా" (గీత–7–13)**

(విచిత్రకార్యాలను చేస్తున్నందున మాయ అనబడే ప్రకృతి దేవుడనబడే నాచే నిర్మింపబడినదై, దాటడానికి సాధ్యం కానిది కదా!) అనికదా, అతడు పలికాడు.

(దక్షమ్ దాధార)– మోక్షఫలప్రదత్వాన్ని ఇతడే ధరిస్తున్నాడు "ఉతామృతత్వస్యేశానః" (పురుషసూక్తమ్) (మోక్షానికి ఈశ్వరుడు పరమపురుషుడే) అని పల్కింది సూక్తం. "మోక్షమిచ్ఛేజ్జనార్దనాత్" (జనార్దనునివల్ల మోక్షాన్ని కోరాలి– అని అన్నారు, ఋషులు. "మామేవ యే ప్రపద్యంతే మాయా మేతాం తరంతి తే" (గీత–7–13) (నన్నే ఎవరు శరణు పొందుతున్నారో, వారు ఈ మాయను దాటుతున్నారు)అని భగవంతుడు తానే స్వయంగా నోరుషతెరచి పలికాడు.

(ఉత్తమం దక్షమ్)– మిక్కిలి గొప్పదైన ముక్తిఫలప్రదత్వ గుణాన్ని–అని అర్థం. జగత్కారణత్వం, ముక్తిఫలప్రదత్వం– అనేవి సర్వలోక సార్వభౌముడైన భగవంతునకు ఛత్రచామరాలవలె అసాధారణ లక్షణాలు– అని కదా ఆచార్యులందఱు పలికారు. నిత్యానపాయిని అయిన లక్ష్మీదేవికి కూడా ముక్తిఫలప్రదానకార్యంలో అన్వయం లేదు– అనే రీతిలోనిది కదా ఇతని ఉపాయాంతరనైరపేక్ష్యం ఉంటుంది. పరమప్రాప్యమైన మోక్షాన్ని ఇచ్చే గుణమైనందున, ఉత్తమమైన ఫలం– అనబడుతున్నది. ఫలవాచియైన

దక్షపదాన్ని ప్రయోగించినందున, ఈ గుణమే భక్తులందరికి రక్షకం—అని తెలుపబడుతున్నది. ఇది ఉత్తమమై ఉండడానికి ఏమి కారణం? అంటే,

(అహర్విదమ్)– **"అహస్"** శబ్దవాచ్యుడైన భగవానుని పొందడానికి కారణమై ఉండడమే– అని అర్థం.

**"అహ స్తదవలుంపతు"** (అహస్సు—పగలు అనడే భగవానుడు ఆ పాపాన్ని పోగొట్టుగాక) అని వేదంలో,

**"పకలై చ్చెన్ఱు నాడి క్కణ్ణ మంగైయుళ్ కణ్డుకొణ్డేనే"** (పెరియ తిరు) (పగలు అనే శబ్దంతో చెప్పబడే భగవంతుని అన్వేషించి, తిరుక్కణ్ణమంగై అనేక్షేత్రంలో దర్శించాను) అని

**"పకల్కణ్డేన్ నారణనై క్కణ్డేన్"** (పగలును చూచాను, నారాయణుని చూచాను) అని ఆళ్వార్లు కూడా అహశ్శబ్దవాచ్యుడు భగవానుడని తెలిపారు కదా! **"అహర్విందంత్యనేన"** అనే వ్యుత్పత్తిద్వారా **"అహర్విత్"** అనే శబ్దం భగవత్ప్రపత్తిసాధనమైన భగవానుని ముక్తిఫలప్రదత్వసామర్థ్యాన్ని తెల్పుతున్నది.

లేక, **"తస్మా ద్వా ఏతం సేతుం తీర్త్వా అపి నక్తమహరేవ అభినిష్పద్యతే. సకృద్విబోధో హ్యేష బ్రహ్మలోకః"**

(మోక్షోపాయమైన ఈ పరమాత్మను పొందితే, రాత్రికూడ పగలు అవుతున్నది. ఏ నాడూ అస్తమించని పగలుగా ఉంటుంది కదా, ఈ బ్రహ్మస్వరూపం) అనే విధంగా పరబ్రహ్మ ప్రాప్తిని పగలు– అని నిర్దేశించే క్రమం ఉన్నందున, ఆ భగవత్ప్రాప్తికి సాధనమై ఉండేది– అని "అహర్విత్" శబ్దానికి అర్థాన్ని గ్రహించవచ్చు.

**(సఖివాన్ విష్ణుః ఉత్తమం దక్షం దాధార)** – **"సఖివాన్"** అనే పదాన్ని మూడవ పాదంలోను, నాల్గవ పాదంలోను ఈ విధంగా రెండు చోట్ల అన్వయించుకోవాలి. సహచరులతో విష్ణుభగవానుడు మోక్షఫల

ప్రదత్వగుణాన్ని ధరిస్తున్నాడు. నిరుపాధిక పురుషకారప్రద అయిన పిరాట్టితో, ఆమెతో గల సంబంధంచేత పురుషకారత్వ మహిమను పొందిన నిత్యముక్తులు, భాగవతులు, ఆచార్యులు– మొదలైనవారితో కూడిన భగవానుడు ముక్తి ఫలప్రదుడవుతున్నాడు. ఫలప్రదానసంకల్ప సమయంలో వేరెవ్వరినీ అపేక్షించకపోయినా, దానికి ముందు, అనాదికాలం దుష్కర్మలను చేసే కాలం గడిపే ఇతనిని చూచి కోపంతో ప్రజ్వలించే సర్వేశ్వరుని ఉపశమింపజేసి, అతనివద్ద చేతనుని ఆశ్రయింపజేయడానికి, చల్లని నీరువంటి లక్ష్మీదేవి మొదలైనవారి పురుషకారకృత్యం తప్పక ఆవశ్యకమైనందున, సహచరులతో కూడిన ఇతడు ముక్తి ఫలప్రదత్వాన్ని ధరిస్తున్నాడు అని అనడంలో విరోధం లేదు.

**"ఆకించన్యైకశరణాః కేచిద్భాగ్యాధికాః పునః,**
**యత్పదాంభోరుహద్వంద్వం ప్రపద్య ప్రీతమానసాః,**
**లక్ష్మీం పురుషకారేణ వృతవంతో వరానన!,**
**మత్ క్షమాం ప్రాప్య సేనేశ! ప్రాప్యం ప్రాపకమేవ మామ్,**
**లబ్ధ్వా కృతార్థాః ప్రాప్స్యంతే మామేవానన్యమానసాః"**

(అందమైన ముఖాన్ని కల్గిన ఓ సేనాధిపతీ! ఏ ఉపాయానుష్ఠానాన్ని చేయకపోవడమనే ఆకించన్యాన్నే ఆలంబనంగా (శరణంగా) కల కొందఱు భాగ్యశాలురైతే, నా శ్రీచరణపదయుగాన్నే ప్రేమతో కూడిన మనస్సు కలవారై శరణు పొంది, లక్ష్మీదేవిని పురుషకారంగా ఆశ్రయించి, నా క్షమకు లక్ష్యభూతులై, నన్నే ప్రాప్యప్రాపకాలుగా ఆశ్రయించి కృతార్థులై, వేఱు దేనిలోను మనస్సు ప్రవేశించనివారై, నన్ను పొందుతారు) అని,

**"అహం మత్ప్రాప్త్యుపాయో వై సాక్షాత్ లక్ష్మీపతిః స్వయమ్,**
**లక్ష్మీః పురుషకారేణ వల్లభా ప్రాప్తియోగినీ,**
**ఏతస్మాచ్చ విశేషోఽయం నిగమాంతేషు శబ్ద్యతే"**

వేదమ్ తమిఝ్శెయ్ ద మాఱన్

(లక్ష్మీపతిని అయిన నేనే నన్ను ఆశ్రయించడానికి ఉపాయమవుతున్నాను. నాకు ఇష్టురాలైన లక్ష్మీదేవి పురుషకారంతో నన్ను ఆశ్రయించడంలో సహాయపడుతున్నది. పురుషకారత్వమనే ఈ గొప్పతనం ఈమెకు వేదాంతాలలో చెప్పబడుతున్నది) అని,

**మత్ప్రాప్తిం ప్రతి జంతూనాం సంసారే పతతా మధః,**

**లక్ష్మీః పురుషకారత్వే నిర్దిష్టా పరమర్షిభిః,**

**మమాపి చ మతం హ్యేతత్ నాన్యథా లక్షణం భవేత్**

(సంసారంలో కిందకు పడే(బాధపడే)– జీవులకు, నన్ను ఆశ్రయించే విషయంలో లక్ష్మీదేవి గొప్ప ఋషులచే పురుషకారంగా నియమింపబడింది. పురుషకారస్వరూపిణిగా చెప్పబడింది. నాకు కూడా ఇదే ఇష్టం. వేఱయిన అంటే, ఉపాయత్వమనే ఆకారం లేదు) అనే ఈ పాంచరాత్రవచనాలే (కారణం.)

(**సఖివాన్ విష్ణుః ప్రజం చ అపోర్ణుతే**)– సహచరులతో కూడిన విష్ణువు మేఘాన్ని ఏ లోటు లేకుండా చేస్తున్నాడు. ఇంద్రుడు, వరుణుడు మొదలైనవారితో కూడిన భగవంతుడు లోకానికి వర్షం కురిపించడంద్వారా ఇహలోక ఫలాలను అనుగ్రహిస్తున్నాడు– అని అర్థం. పైరులు చిగిర్చి, వర్ధిల్లడానికి కారణమైన వర్షాన్ని కురిపించడమనేది ఇహలోక ఫలాలను అనుగ్రహించడంలో గొప్పది కనుక, దానిని ప్రస్తావించి మిగిలినవానిని వానిద్వారా వేదపురుషుడు లక్షిస్తున్నాడు, ఇంద్రుడు వర్షాన్ని కురిపిస్తున్నాడు. "**ఆఝిమఴై క్కణ్ణా!**" అయిన వరుణుడు వర్షాన్ని కురిపిస్తున్నాడని లోకప్రసిద్ధి అయినా, వారిని నిమిత్తమాత్రంగా గ్రహించి, వర్షం మొదలైన ఇహలోక ఫలాలను అనుగ్రహించేవాడితడే– అనే మహార్థాన్ని ఈ మంత్రం తెల్పుతున్నది.

**"కామై స్తై స్తైః హృతజ్ఞానాః ప్రపద్యంతే஽న్యదేవతాః,**

**తం తం నియమ మాస్థాయ ప్రకృత్యా నియతా స్వయా,**
**యో యో యాం యాం తనుం భక్తః శ్రద్ధయాఽర్చితు మిచ్ఛతి,**
**తస్య తస్యాచలాం శ్రద్ధాం తామేవ విదధామ్యహమ్,**
**స తయా శ్రద్ధయా యుక్త స్తస్యారాధన మీహతే,**
**లభతేచ తతః కామాన్ మయైన విహితాన్ హితాన్"**

(తమ పాపవాసనలతో కూడినవారై, దానికి తగిన త్రిగుణమయాలైన, కోరబడే విషయాలతో నా స్వరూపవిషయంలోని వారి జ్ఞానం నశించినవారై, ఇంద్రుడు మొదలైన అన్యదైవాలను శరణు పొందుతున్నారు. నాకు శరీరభూతమైన ఏ యే దైవాన్ని శ్రద్ధతో ఏ యే మానవుడు పూజించగోరుతున్నాడో, ఆ యా మానవునకు, ఆ శ్రద్ధను నేను స్థిరంగా ఉండేటట్లు చేస్తున్నాను. ఆ శ్రద్ధతో కూడిన అతడు, ఆ దైవంయొక్క ఆరాధనను కోరుతున్నాడు. దానివల్లనే (నిజానికి) నాచేతనే అనుగ్రహింపబడిన ఆ కోరిన వస్తువులను ఇతడు పొందుతున్నాడు) అని శ్రీకృష్ణుడు అన్నాడు, గీతలో.

ఈ విధంగా వేదంలో, పాంచరాత్రంలో, భగవద్గీతలో తెలుపబడిన అర్థాన్ని నమ్మాళ్వారులు ఏ విధంగా తమ ఆశ్రమంలో తెలియజేశారు చూడండి.

**"అవరవర్ తమతమ దటివటివకై వకై**
**అవరవర్ ఇఱైయవర్ ఎనవడి అడైవర్ గళ్,**
**అవరవర్ ఇఱైయవర్ కుఱైవిలర్ ఇఱైయవర్,**
**అవరవర్ విదివழி అడైయ నిన్టనరే"**

ఇది తిరువాయ్ మొழி వ ప్రబంధంలోని మొదటి దశకంలోని పాశురం. దీని భావం ఏమంటే–

ఆయా అధికారులు, తమ తమ జ్ఞానంతో తెలియబడే అనేక విధాలయిన ప్రకారాలలో, తాము అభిమానించిన ఆయా దైవాలను స్వాములు అని తలచి, వారిని ఆశ్రయిస్తున్నారు. ఆయా అధికారులచే ఆరాధింపబడే ఆ దైవాలు వారు వారు అభీష్టాలను ఇవ్వడంలో ఏ విధమైన కొరత లేనివారే. ఎందుకంటే, సర్వస్వామి అయిన శ్రీమన్నారాయణుడు తమ తమ అదృష్టానుసారంగా ఆయా అధికారులు ఆయా ఫలాలను పొందేటట్లుగా ఆయా దేవతలకు అంతర్యామిగా నిలచి ఉన్నాడు) అని నమ్మాళ్వార్లు ఈ అర్థాన్ని అనుగ్రహించారు.

ఈ విధంగా ఈ మంత్రంతో సకల ఫలప్రదుడు విష్ణువే– అనే ఏఅర్థం స్థిరీకరింపబడిందో, ఆ అర్థమే ఈ పాశురంలో స్పష్టం చేయబడింది. ఇటువంటి అర్థసామ్యాలు వేద సూక్తులకు, తిరువాయ్ మొళి పాశురాలకు మధ్య అనేకం ఉన్నాయి. వాటిని మన పూర్వాచార్యులు తమ వ్యాఖ్యానాలలో పలుచోట్ల వివరించారు.

★★★★★

# తిరువాయ్ మొழி - ద్వయమ్

★★★★★

(వాగమృతవర్షి వేలుక్కుడి శ్రీమాన్ వరదాచార్యస్వామి వారి "తిరువాయ్ మొழி ద్వయమ్" అనే గ్రంథం నుండి)

★★★★★

"తత్త్వజ్ఞానాన్మోక్షః" (తత్త్వజ్ఞానంవల్ల మోక్షం సిద్ధిస్తుంది) అనేది సర్వసిద్ధాంతసారం. సంసారులకు మోక్షప్రయోజక (మోక్షాన్ని కల్గించే) తత్త్వజ్ఞానం కల్గడంకోసం, వారు ఆత్మాంతదాస్యరసం పొందడంకోసం కృషి చేసేవాడు శ్రియఃపతి అయిన సర్వేశ్వరుడు, అతడు సంసారులైన జీవాత్మలు ఉజ్జీవించడం కోసం శాస్త్రప్రదానాన్ని చేసిన మహోపకారకుడు. బదరికాశ్రమంలో తిరుమంత్రమనే మహామంత్రాన్ని ఉపదేశించాడు. ఆ స్వామియే విష్ణులోకంలో ద్వయమనే మంత్రాన్ని ప్రకాశింపజేశాడు. అతడే కురుక్షేత్రమనే దివ్యదేశంలో చరమశ్లోకమనే రహస్యాన్ని ఉపదేశించాడు. ఈ రహస్యాలు మూడింటిని మన పూర్వాచార్యులు రహస్యత్రయమని అన్నారు.

రహస్యత్రయంలోని మొదటి రహస్యం – "ఓమ్ నమో నారాయణాయ" అనే మూలమంత్రమైన తిరుమంత్రం. దానికి వివరణరూపమైనది – రెండవ మంత్రమైన ద్వయమంత్రం. "శ్రీమన్నారాయణచరణౌ శరణం ప్రపద్యే, శ్రీమతే నారాయణాయ నమః" అనే మంత్రమే ద్వయమంత్రం. మూడవ రహస్యం – చరమశ్లోకం.

ఈ రహస్యత్రయానికి మన పూర్వాచార్యులు పలువురు వ్యాఖ్యానాలను అనుగ్రహించినా, మనకిపుడు లభిస్తున్నవాటిలో మొదటిది లభిస్తున్నది శ్రీభట్టర్ అనుగ్రహించిన అష్టశ్లోకియే.

ఎనిమిది శ్లోకాలను కల్గిన అష్టశ్లోకిలో, మొదటి నాల్గు శ్లోకాలతో తిరుమంత్రాన్ని వ్యాఖ్యానించారు. తరువాత, అయిదవ, ఆఱవ శ్లోకాలతో

ద్వయాన్ని వివరించారు. అయిదవ శ్లోకంలో ద్వయంలోని పది అర్థాలను, ఆఱవ శ్లోకంలో వాక్యార్థాన్ని శ్రీభట్టర్ తెలిపారు.

రెండు వాక్యాలతో కూడినది, ఆఱు పదాలతో కూడినది, పది అర్థాలను కల్గినది– ద్వయం. ఆ పది అర్థాలు –1. శ్రీశబ్దార్థం, (2) మతుప్ ప్రత్యయార్థం, (3) నారాయణశబ్దార్థం, (4) చరణశబ్దార్థం, (5) శరణశబ్దార్థం, (6) "ప్రపద్యే" శబ్దార్థం – ఈ విధంగా ఈ ఆఱు అర్థాలు పూర్వవాక్యంలో తెలుపబడ్డాయి.

ఇక, ఉత్తరవాక్యంలో, (1) శ్రీమచ్ఛబ్దార్థం, (2) నారాయణశబ్దార్థం, (3) 'ఆయ' అనే చతుర్థీవిభక్తి ప్రత్యయార్థం, (4) నమశ్శబ్దార్థం– అనే నాల్గు అర్థాలు తెలుపబడ్డాయి. ఇది పరాశరభట్టర్ చేసిన అర్థనిర్వాహం.

శ్రీపిళ్ళైలోకాచార్యులవారు అనుగ్రహించిన 18 రహస్య గ్రంథాలలో సారసంగ్రహమనేది ఒకటి. అందులో, ద్వయానికి ద్వయమనే పేరు కల్గడానికి కారణంమేమో వివరించారు. ద్వయంలోని పూర్వవాక్యంలో ఉపాయం (పొందే దారి), ఉత్తరవాక్యంలో పొందే ఫలం– అనే ఈ రెండు తెలుపబడుతున్నాయి.

**"శ్రీమన్నారాయణచరణౌ శరణం ప్రపద్యే"** – భగవానుని పొందడానికి అతని శ్రీచరణాలను శరణంగా ఆశ్రయించడమే ఉపాయం. ఆ విధంగా ఆశ్రయించడంవల్ల పొందే ఫలం **"శ్రీమతే నారాయణాయ నమః"**– అని అతనికి మనం చేసే కైంకర్యమే. ఈ రెండు అర్థాలను తెలుపుతున్నందున ఇది ద్వయం అనబడుతున్నది. పిరాట్టి లక్ష్మీదేవి, భగవంతుడు. అనే రెండు తత్త్వాలను తెల్పుతున్నందున ద్వయం అని, **"చరణౌ"** అని శ్రీచరణాలను రెండిటిని తెల్పుతున్నందున ద్వయం– అని పలు రీతులలోని నిర్వాహాలను శ్రీపిళ్ళైలోకాచార్యులవారు తెలిపారు.

నమ్మాళ్వార్లు అనుగ్రహించిన తిరువాయిమొழி ద్వయార్థ ప్రతిపాదకమని మన పూర్వాచార్యుల అభిప్రాయం. దానిని శ్రీపిళ్ళైలోకాచార్యులవారు, వాదికేసరి అழకియ మణవాళచ్చీయర్, వేదాంత దేశికన్ మొదలైనవారు ఏ విధంగా తెలిపారో, దానినిగూర్చి వివరంగా గమనిద్దాం.

ద్వయంలోని పది అర్థాలు– తిరువాయిమొழிలోని పది శతకాలతో వివరింపబడ్డాయి– అని శ్రీ పిళ్ళై లోకాచార్యులవారు సారసంగ్రహంలో తెలిపారు.

పరాశరభట్టర్ పూర్వవాక్యంలో ఆఱు అర్థాలు, ఉత్తర వాక్యంలో నాల్గు అర్థాలు తెలుపబడ్డాయని అన్నారు. అయితే, శ్రీపిళ్ళైలోకాచార్యులవారు పూర్వవాక్యంలో అయిదు అర్థాలు, ఉత్తర వాక్యంలో అయిదు అర్థాలు తెలుపబడ్డాయని అన్నారు. తిరువాయిమొழிలోని మొదటి అయిదు శతకాలు పూర్వవాక్యవివరణమని, తరువాత అయిదు శతకాలు (పదులు) ఉత్తరవాక్య వివరణమని వారి అర్థనిర్వాహం.

తిరువాయిమొழிకి పన్నీరాయిరప్పడి– అనే వ్యాఖ్యానాన్ని అనుగ్రహించిన వాదికేసరి అழకియమణవాళచ్చీయర్ తమ వ్యాఖ్యలోని ప్రవేశంలో

**“శ్రీపతిః చేతనస్యాస్య హేతుత్వేన సమాశ్రితః,**

**అనిష్టహాని మిష్టస్య, ప్రాప్తిం చ కురుతే స్వయమ్”**

(ఉపాయంగా ఆశ్రయింపబడిన శ్రియఃపతి చేతనునకు ఇష్టప్రాప్తిని, అనిష్టనివృత్తిని స్వయంగా కలుగజేస్తాడు) అనే ఒక శ్లోకాన్ని అనుగ్రహించారు.

**“ఈ జీవాత్మ భగవంతుని ఉపాయంగా ఆశ్రయించినవాడైతే, అతనికి ఆ సర్వేశ్వరుడు తానే అనిష్టాన్ని తొలగించి, ఇష్టాన్ని పూర్తిచేస్తాడు”** అనేది ఈ శ్లోకంలోని అర్థం.

ఇందులో అయిదు అర్థాలు తెలుపబడ్డాయి. అవి (1) భగవంతుడు, (2) చేతనుడు, (3) ఉపాయం, (4) అనిష్టనివృత్తి, (5) ఇష్టప్రాప్తి– అనేవి. ఈ అయిదు అర్థాలను క్రమంగా తిరువాయిమొழிలోని రెండు, రెండు శతకాలతో– మొత్తం పది శతకాలతో నమ్మాళ్వార్లు వివరించారు– అనేది వాదికేసరి జీయర్ నిర్వాహం. వాదికేసరి జీయర్ ఇంకొక నిర్వాహాన్ని కూడా అనుగ్రహించారు. అది ఏమంటే– మొదటి నాల్గు. శతకాలు సిద్ధవస్తువైన పరమాత్మ, జీవాత్మలు క్రమంగా రెండు రెండు శతకాలతో తెలుపబడుతున్నాయి. చివరి నాల్గు శతకాలు సాధ్యవస్తువును తెల్పుతున్నాయి. సర్వేశ్వరుడు ఎల్లప్పుడు ఉండేవాడు. అందుచేత అతడు ఉపాయమవుతున్నాడు. దానిని అయిదవ శతకం తెల్పుతున్నది. సిద్ధోపాయ ప్రతిపాదకం అయిదవ శతకమని తాత్పర్యం. అతడు ఎల్లప్పుడూ ఉపాయమై ఉన్నా, అతనిని మనం ఉపాయంగా తెలిస్తే, ఆ స్వామిని ఆశ్రయించడం సాధ్యం. ఇది ఆఱవ శతకంలో తెలుపబడుతున్నది.

ద్రమిడోపనిషత్ సారమనే గ్రంథంలో వేదాంతదేశికులు మొదటి శతకంలో– భగవంతుడు ఉపాయమని, రెండవ శతకంలో – భగవంతుడు ప్రాప్యుడని, మూడవ శతకంలో– ఆ విధంగా ప్రాప్యప్రాపక భూతుడైన భగవంతుడు దివ్యమంగళవిగ్రహ విశిష్టుడని, నమ్మాళ్వార్లు తెల్పినట్లు పలికారు. నాల్గవ శతకంలో–అతడు తప్ప వేఱు ఫలం లేదు– అని నిష్కర్షించారని, తరువాత గల ఆఱు శతకాలతో అతడు తప్ప వేఱు ఉపాయం లేదని నమ్మాళ్వార్లు తెలిపారు. అంటే– దివ్యమంగళ విగ్రహవిశిష్టుడైన భగవంతుడు ప్రాప్యప్రాపక భూతుడని తెలుపుతున్నది, నమ్మాళ్వార్ల తిరువాయిమొழி - అనేది దేశికుల నిర్వాహం.

ఈ విధంగా పూర్వాచార్యులు ఒక్కొక్కరు ఒక్కొక్క రీతిలో తిరువాయ్ మొழிని, ద్వయాన్ని చేర్చి సమన్వయించి పలికారు. ఈ

వివరాలను అనుభవించడమే (తెలిసికోవడమే) పరమభోగ్యంగా తలచిన మన ఆచార్యుల అభిప్రాయాలను, నిర్వాహాలను యథాతథంగా తెలిసికొని ఆనందించడమే మనకు స్వరూపానురూపమైన కాలక్షేపం.

★★★★★

# శ్రీరంగరాజస్తవం ఉత్తరశతకం– భట్టర్ సహస్రనామభాష్యం

★★★★★

భట్టర్ ఉత్తరశతకంలోని పలు శ్లోకాలకు – భగవద్గుణదర్పణమనే శ్రీవిష్ణుసహస్రనామ భాష్యంలో పలునామాలకు వారు అనుగ్రహించిన భాష్యానికి గల సామ్యం కన్పిస్తుంది. ప్రత్యేకించి, షాడ్గుణ్యనిరూపణ సందర్భంలో, పలు అవతారాలను స్తుతించే సందర్భంలో ఈ సామ్యం చాలా స్పష్టంగా గోచరిస్తుంది. సహస్రనామ భాష్యం అవతారికలో భట్టర్ సగుణ–నిర్గుణ శ్రుతుల నిర్వాహప్రకారాన్ని తెలిపే సందర్భంలో నిర్గుణబ్రహ్మం, సగుణబ్రహ్మమని రెండు బ్రహ్మములు లేవని అంటూ, **"దోషావధ్యుపధాసంఖ్యావిధురైః మంగళైర్గుణైః పరిపూర్ణం పరంబ్రహ్మ శాస్త్రైః జోఘుష్యతే తరామ్"** అనే కారికను అనుగ్రహించారు. ఈ సూక్తికి, ఉత్తరశతకంలోని **"దోషోపధావధి సమాతిశయానసంఖ్యానిర్లేప మంగళగుణౌఘదుఘాః షడేతాః"** ఇత్యాది శ్లోకంలో గల సామ్యం స్ఫుటం. ఇంతేకాక, **"మంగళమ్ పరమ్"** – అనే నామాన్ని వివరిస్తూ **"నైసర్గికనిత్యనిరవధిక నిస్సీమనిస్సంఖ్యస్వగుణ"** అనే సూక్తిలో కూడా శబ్దార్థసామ్యం సువ్యక్తం. ఈ విధంగానే జ్ఞానాదిషాఢుణ్య నిరూపణలో ఆ గుణాలను భగవానుడు కల్గి ఉన్నాడని అనడంచేత బాహ్యవేదవిరుద్ధమతాలు నిరసింపబడిన రీతిని తెలుపడంలో కూడా సామ్యం కన్పిస్తుంది. దీని వివరం వ్యాఖ్యానంలో గమనించవచ్చు. ఐశ్వర్యగుణంవల్ల సాంఖ్యమతం నివారింపబడిందని అంటూ **"జ్ఞానమయాదపి అకర్తుః అలసోదాసీనాత్ సాంఖ్యైశ్వర్యాత్ వ్యావర్తకమైశ్వరం గుణమాహ"** అని **"మహోత్సాహః"** (173) అనే నామానికి అనుగ్రహించిన భాష్యంలో అన్నారు. ఇదే భావం

**“సార్వజ్ఞ్యేనాజమూలం జగదభిదధతో వారితాః సాక్షిమాత్రాత్ సాంఖ్యోక్తా కారణం త్వాం పరయతి”** అనే శ్లోకంలో తెలుపబడింది.

భట్టర్ ఉత్తరశతకంలోని పలు అవతారాలను స్తుతించే శ్లోకాలకు, ఆ అవతారాల వైభవాన్ని తెలిపే నామాలకు వారు అనుగ్రహించిన భాష్యంతో కూడా చాలా పోలికలున్నాయి. దశావతారాలను ప్రస్తావించడానికి ముందుగా భట్టర్ హయగ్రీవ, హంస, వటపత్రశాయి అమృతమథన, గజేంద్రమోక్షాది అవతారాలను ప్రస్తావించడానికి సహస్రనామస్తోత్రంలోని ఆ అవతారాల నామాలే మూలం– అని చెప్పవచ్చు. ఆ నామాలకు భట్టర్ చేసిన భాష్యానికి, ఆ అవతారాలను స్తుతించే శ్లోకాలకు మధ్య ఉండే సామ్యాన్ని గమనిస్తే ఈ విషయం స్పష్టపడుతుంది. ఉదాహరణకు **“పేశలః”** (916) అనే నామానికి **“సంభ్రమాత్ అయథాయథం స్రగ్భూషాంబరరమణీయః”** అని చేసిన వివరణంలోని భావం **“స్రగ్భూషాంబర మయథాయథం దధానః”** (59) అనే శ్రీ రంగరాజస్తవ శ్లోకసూక్తిలో, **“దక్షిణః”** (918) అనే నామాన్ని **“ధిజ్మాం, దూరగతోఽహం త్వామ్ ఇతి సాంత్వనైః”** ఇత్యాదిగా చేసిన వివరణం **“దిజ్మామిత్యనుగజగర్జమ్”** (59) అనే శ్లోకసూక్తిలో గోచరిస్తుంది. ఇంకా ఇంటువంటి మఱి కొన్ని సామ్యాలు వ్యాఖ్యానంలో తెలుపబడ్డాయి.

ఈ విశేషాలను, విధంగా శారీరకమీమాంసలో శ్రీవిష్ణుసహస్రనామ స్తోత్ర భాష్యంలోని విశేషాలను భట్టర్ ఉత్తరశతక శ్లోకాలలో వాటి ప్రమేయంగా గ్రహించడంలోని ఆంతర్యాన్ని ఈ రీతిలో గమనించవచ్చు. భట్టర్ తిరువాయ్ మొ**ళ్రి** ప్రబంధానికి తనియన్ పాశురాన్ని అనుగ్రహిస్తూ **“వాన్ తికళ్రుమ్ శోలై మదిళరఙ్గర్ వణ్పుకళ్ర మేల్ ఆన్ట తమిళ్ర మఱైకళ్ ఆయిరముమ్”** (ఆకాశాన్ని తాకే ఉద్యానవనాలను, ప్రాకారాలను కల శ్రీరంగానికి స్వామి అయిన శ్రీరంగనాథుని దివ్యగుణాలను విషయంగా కల ద్రావిడ వేదరూపాలైన పాశురాలు వేయింటిని) అని ప్రబంధ ప్రతిపాద్యుడు

శ్రీరంగనాథుడే – అని అన్నారు. ఈ నిర్వాహానికి ఆ ప్రబంధంలో 7వ శతకం 2వ దశకం చివరి పాశురంలో గల "**ముకిల్ వణ్ణనడి మేల్ శొన్న శొన్మాలై ఆయిరత్తుళ్**" అనే సూక్తిమూలమని, శ్రీరంగనాథుని ప్రతిపాద్యవిషయంగా కల్గిన ఆ దశకం చివరలో గల ఈ సూక్తిలోని "**ముకిల్ వణ్ణన్**" అనే పదం శ్రీరంగనాథుని నిర్దేశిస్తుందనే విషయాన్ని, "**కాళమేఘమ్పోలే నిరతిశయసౌందర్యయుక్తరాన పెరియ పెరుమాళ్ విషయమాక అరుళిచ్చెయ్ద**" (కాలమేఘంవలె సాటి లేని సౌందర్యాన్ని కల శ్రీరంగనాథుని విషయంలో అనుగ్రహించిన) అని నమ్బిళ్ళై తమ వ్యాఖ్యాన సూక్తి ద్వారా తెలియజేశారు. ఈ తిరువాయ్ మొఴిలోని వేయి పాశురాలు భగవానుని వేయి నామాలనే విషయాన్ని "**శడకోపన్ తెరిన్దురైత్త నామజ్గళ్ ఆయిరత్తుళ్**" (5-9-11) అని ఆళ్వార్లే స్వయంగా పలికారు. తిరువాయ్ మొఴి పాశురాలకు, భగవన్నామాలకు గల ఈ సామ్యాన్ని నంబిళ్ళై ఈడువ్యాఖ్యలో "**అవనుక్కు త్తిరునామజ్గళ్ పోలే గుణచేష్టికళుక్కు ప్రతిపాదకమాన ఆయిరత్తిలుమ్**" (భగవానుని తిరునామాల వలె గుణాలను, లీలలను తెలిపే వేయి పాశురాలలో) అని, "**ఆయిరమ్ తిరునామజ్గళై చ్చొన్నాల్ అవన్ గుణజ్గళ్ మాపోలేయిఱే ఇవఱ్ఱుక్కుమ్ అవన్ గుణజ్గళ్ తోఱ్ఱుమ్పడి**" (సహస్రనామాలను పల్కితే భగవానుని గుణాలు స్ఫురించేటట్లు, వీటికి కూడా భగవానుని గుణాలు వ్యక్తమవుతాయి) అని వివరించారు. అందువల్ల తిరువాయ్ మొఴి ప్రబంధానికి, విష్ణుసహస్రనామ స్తోత్రానికి గల సామ్యం స్పష్టం, ఈ దృష్టిలోనే భట్టర్ పలు శ్లోకాలలో సహస్రనామ భావాలను గూర్చి, సహస్రనామస్తోత్రం కూడా శ్రీరంగనాథుని విషయంగా కల్గిదనే తమ అభిప్రాయాన్ని సూచించారు.

★★★★★

# భట్టర్ సూక్తిలోని మధురిమ

★★★★★

శ్రీభట్టారకభవ్యవాఙ్మధురిమా విద్వన్మనోహారిణీ
సా శ్రీరంగప్రభుసంస్తుతౌ సువిశదం రారాజతే హి స్ఫుటమ్ ।
తత్రైకామిహ సంప్రదర్శ్య వివృణోమ్యర్థే స్ఫురద్ గౌరవం
తత్కించిత్ మితవాక్తతేః మమ మతౌ యద్భాసతే భక్తితః॥

అహృతసహజదాస్యాః సూరయః స్రస్తబంధాః
విమలచరమదేహా ఇత్యమీ రంగధామ ।
మహితమనుజతిర్యక్ స్థావరత్వాః శ్రయంతే
సునియతమితి హ(యే)స్మ ప్రాహు రేభ్యో నమః స్తాత్॥

ఇది, భట్టర్ అనుగ్రహించిన శ్రీరంగరాజస్తవం పూర్వశతకంలోని ఒక సూక్తి. ఇందులోని మాధుర్యాన్ని కొంచెం అనుసంధిద్దాం.

పరమపదనాథుడు శ్రీరంగనాథుడు కాగా, పరమపదములోని నిత్యులు, ముక్తులు తమ స్వరూపమగు శేషవృత్తిని విడువనివారై, శ్రీరంగమున తిర్యక్, స్థావర రూపములను సైతము పొంది, భగవానుని నిత్యము దర్శించుచు, సేవించుచున్నారు. **“సదా పశ్యంతి సూరయః”** (సుబాల, 8) (నిత్య సూరులు ఎల్లప్పుడూ భగవానుని దర్శిస్తున్నారు) అను వేదవాక్యము ఇచటను అర్థవంతమేనని భావము. ఇందువలన శ్రీరంగ నగరమునకు వైకుంఠనగరముతో సామ్యము సిద్ధము. దీనినిబట్టి నిత్య, ముక్త, ముముక్షువులు కానివారికి శ్రీరంగమున స్థానము పొందుట, కనీసము తిర్యక్, స్థావరరూపములనైనను పొందుట దుర్లభమని ఏర్పడుచున్నది. **“శరీరజైః**

**కర్మదోషైః యాతి స్థావరతాం నరః**"– (ప్రాకృత శరీరంతో చేసిన పాపాల కారణంగా మానవుడు చెట్లు, చేమలుగా పుడుతున్నాడు) అనునట్లు శరీరముతో చేసిన దుష్కర్మల ఫలముగా మానవుడు స్థావరజన్మను పొందును – అని శాస్త్రములలో చెప్పబడుచున్నను, నిత్యసూరులు కూడ అట్టి స్థావర రూపమును అయినను పొంది, శ్రీరంగనివాసమును చేయవలెనని అభిలషింతురు – అనుటచే ఆ క్షేత్రమహిమ ఎంతటిదో తెలుపబడినది. "**కురుకాయ్ పిఱప్పేనే, మీనాయ్ పిఱప్పేనే, తమ్బకమాయ్ నిఱ్కుమ్, పడియాయ్ కిడన్దు**" (పెరుమాళ్. తి. 4) (తిరుమలలో పిచ్చుకగా జన్మిస్తానా! చేపగా జన్మిస్తానా! స్తంభంగా ఉంటానా? స్వామి గర్భాలయంలో గడపగా పడి ఉంటానా?) అను మొదలగు కులశేఖరసూక్తులను ఇచట స్మరింపనగును. ఈ కవియే శ్రీరంగనాథస్తోత్రమున "**రంగేశ్వర! త్వత్పద మాశ్రితానాం రథ్యాశునా మన్యతమో భవేయమ్**" (6) (శ్రీరంగనాథా! నీ పాదాలను ఆశ్రయించినవారు నడయాడే మార్గాలలో సంచరించే శునకాలలో ఒక శునకంగా అయినా నేను కావాలిసుమా!) అనుచు కనీసము శ్రీరంగనగరవీథులలో సంచరించు శునకములలో తాము ఒక శునకముగా కావలయునని పల్కుట ఇచట ఉట్టంకింపతగినది.

తిరువాయ్ మొళి ప్రబంధంలోని "**మానేయ్ నోక్కు**" (5-9-1) అను పాశురములోని "**తేనార్ శోలైకళ్ శూழ்**" (మకరందం సమృద్ధిగా స్రవించే తోటలను చుట్టూ కలిగిన) అనుచోట ఈడువ్యాఖ్యానంలో నంబిళ్ళై చేసిన అద్భుతమైన వివరణ ఈ శ్లోకాన్ని అనుసరిస్తూ, అనువదిస్తూ చేసినదని అక్కడి వ్యాఖ్యాన పంక్తులు స్పష్టం చేస్తాయి. ఆ సూక్తులను దర్శించడానికి ముందుగా, ఆళ్వారులు పలికిన సందర్భానికి, భట్టర్ పలికిన సందర్భానికి మధ్య ఉండే సామ్యం కూడా ఇక్కడ గమనించదగినది. ముందుగా, ఆళ్వారులు పలికిన సన్నివేశాన్ని గమనిద్దాం.

ఇంతకు ముందు దశకంలో ఆళ్వార్లు తిరుక్కుడందై (కుంభకోణం) అనే దివ్యక్షేత్రానికి మానసికంగా వెళ్లి, అక్కడ భగవంతుని శరణాగతి చేసినప్పటికీ, వారు కోరిన విధంగా ప్రాప్య సిద్ధిని పొందలేకపోయారు. అందువల్ల వారి మనసులోని ఆర్తి మరింత హెచ్చినది. అపుడు వేరొక దివ్యదేశం అయిన తిరువల్లవాழ் కు పోయి, అక్కడ అయినా తాము కోరిన ప్రయోజనాన్ని పొందాలని ప్రయత్నం చేశారు. కానీ, ఆ విధంగా చేయడానికి కూడా వీలు కాని విధంగా తమ శరీరంలో అశక్తి ఏర్పడినందున, ఇంకా క్లేశాన్ని పొందినవారై, తమ క్లేశాన్ని, ఒక నాయకి తాను కోరిన నాయకుని పొందలేనప్పుడు ఆర్తితో పలికే రీతిలో, అన్యాపదేశ ప్రక్రియలో ఈ దశకంలో ఉండే పాశురాలతో తెలుపుతున్నారు. ఇంతటి ఆర్తితో ఉండే దశలో కూడా ఆళ్వారులు ఆ దివ్యదేశంలో ఉండే తోటలలోని భోగ్యతను **"తేనార్ శోలైగళ్"** (మకరందం సమృద్ధిగా స్రవించే పూలతోటలు) అనే ప్రయోగంతో వర్ణిస్తున్నారు.

అంతు లేని ఆర్తి నిండిన ఈ దశలో కూడా, నాయకీ భావాన్ని పొందిన దశలో కూడా, ఆళ్వారులు దివ్యదేశంలోని తోటల భోగ్యతను దర్శించడంలో, దానిని వర్ణించడంలో ఉద్దేశ్యం ఏమి? కారణమేమి? ఇది ఏ విధంగా పొసగుతుంది? అనే ప్రశ్న ఇక్కడ కలుగుతుంది. కనుక, దానికి సమాధానంగా వ్యాఖ్యాత నంబిళ్ళై ఈ విధంగా పలుకుతున్నారు.

"ఇవర్ ఇవ్వాற்றాமైయోడే ఇరుందు శోలైయై క్కవిపాడుకిఱదు – ఉళ్ళ నిఱ్కిఱవనోడు ఒక్క ఇవైయుమ్ భోగ్యమా యిరుక్కయిఱే. ఉపాస్య వస్తు, మనస్సై ప్రత్యగ్విషయమాక్కి అనుభవిక్కమాట్టాదార్ క్కు క్కణ్ణుక్కు ఇలక్కాక్కిక్కొండు నిఱ్కిఱాప్పోలే కాణుమ్, ఇవైయుమ్. ప్రాప్యనానవనుడైయ ఉపాయభావత్తిల్ నిలైపోలే నిత్య ప్రాప్యనాయ్ క్కొండు

ఇంగే ఇరుక్కి౽అవన్, ఆశ్రితర ఉకందదు ఒరు ద్రవ్యత్తై తిరుమేనియాక క్కొ౽ండు, ముకమ్ కొడుత్తుక్కొ౽ండు నిఱ్కి౽ఱాప్పోలే, అంగుళ్ళారుమ్ ఇంగే పోందు, స్థావరంగళాయుమ్, జంగమంగళాయుమ్, తిర్యక్కు౽కళాయుమ్ ఇవనై విడమాట్టాదే నిఱ్కు౽అపడి. నిత్యరుమ్, ముక్తరుమ్, బద్ధరిల్ రుచియుడైయారుమ్ ఉగందరుళిన నిలంగళై **ప్పఱ్ఱి**యిఱే కిడప్పదు అహృతసహజదాస్యాః – ఇత్యాది. రామావతారత్తిలుమ్ ఒరు లక్ష్మణాదికళ్, వానరత్వజ్గళై యడైన్దార్ కళ్, విభీషణాదికళ్ '**పఱ్ఱి**కిడన్దార్ కళ్, అదుపోలే, అదిలుమ్, నడయాడిత్తిరువార్ క్కు౽ ప్పోకైక్కు౽మ్ యోగ్యత్తై యుణ్డిఱే. అదువు మిల్లైయిఱే స్థావరజ్గళుక్కు౽" (ఈ విధంగా ఈ ఆళ్వారులు ఇంతటి ఆర్తితో ఉన్నప్పటికీ, దివ్యదేశంలో ఉండే తోటలను వర్ణించడంలో అభిప్రాయం ఏమి? అని అంటే, ఈ దివ్యదేశంలో నిత్యవాసం చేసే భగవంతునితో పాటుగా, ఈ దివ్యదేశంలో ఉండే ఈ తోటలు కూడా భోగ్యంగా వీరికి ఉంటాయి కదా. ఉపాసించదగిన వస్తువు అయిన భగవంతుని, మనసును అంతర్ముఖం చేసి, ధ్యానించి, అనుభవించలేనివారికి వారి బాహ్యనేత్రాలకు తన అర్చారూపాన్ని లక్ష్యంగా చేసుకొనేటట్లుగా దివ్యదేశాలలో భగవానుడు నెలకొని ఉండేటట్లుగానే, పరమపదంలో ఉండే నిత్యులు, ముక్తులు కూడా భగవంతుడు నెలకొని ఉండే దివ్య దేశాలలో మానవ తిర్యక్ స్థావరాది రూపాలను ధరించి, తమ దర్శనాన్ని అనుగ్రహిస్తున్నారు. ప్రాప్యుడైన భగవంతుడు ఉపాయభావంలో తగిన దశ అర్చారూపమే కదా. ప్రపత్తిని అర్చారూపంలోకదా చేయాలి. నిత్యప్రాప్యుడై పరమపదంలో ఉండే భగవానుడు, భక్తులు ఆదరించిన ఒక ద్రవ్యాన్ని తనకు తిరుమేనిగా గ్రహించి, దర్శనాన్ని ఇస్తూ అర్చారూపంగా దివ్యదేశాలలో నెలకొని ఉండేటట్లుగానే ఆ పరమపదంలో ఉండే నిత్యులు, ముక్తులు కూడా ఈ లోకానికి వచ్చి, స్థావరాలుగానూ, జంగమాలుగాను, తిర్యక్కు౽లుగాను రూపాలను పొందినవారై, భగవంతుని విడువకుండా అతని వెంటనే ఉన్నారు. ఇట్లు

నిత్యులు, ముక్తులు, బద్ధులలో కైంకర్యరుచిని కలవారు కదా, భగవానుడు అభిమానించి వేంచేసి ఉండే దివ్యక్షేత్రాలను ఆశ్రయించి ఉంటారు. అహృతసహజదాస్యాః – అనే శ్లోకార్థమును ఇక్కడ స్మరించాలి. రామావతారంలో కూడా లక్ష్మణుడు మొదలైనవారు, వానరరూపాలను పొందినవారు, విభీషణాదులు వీరి రూపంలో నిత్యులు, ముక్తులు బద్ధులలో దాస్యరుచిని కలవారు భగవంతుని విభవ రూపమైన శ్రీరాముని ఆశ్రయించి ఉన్నారు. ఆ విధంగానే ఇక్కడ కూడా దివ్యదేశంలో నిత్యులు, ముక్తులు మొదలైనవారు స్థావర రూపాలలో భగవంతుని వెంటనే ఉన్నారు. వారిలోనూ, జంగమరూపాలకు ధరించినవారికి ఒకచోటనుండి ఇంకొక చోటుకు పోవడానికి యోగ్యత ఉన్నది కదా. స్థావరాలకు ఆ యోగ్యత కూడా లేదు కదా) అని వ్యాఖ్యానింపబడుట ఇచట ఉట్టంకింపదగినది.

ఇచట లక్ష్మణాదులు నిత్యసూరులని, వానరరూపమును పొందిన దేవతలు ముక్తులని, విభీషణుడు మొదలగువారు ముముక్షువులని నిర్దేశించుచున్నారని అచటి అరుంబదములోని వివరణము, మఱియు, ఈ సందర్భముననే ఈడులో ఒక ఐతిహ్యమును తెలుపు ఈ పంక్తులుకూడా గమనింపతగినవి.

“జననాథ బ్రహ్మరాయర్ తిరుముడిక్కుట్రైయిలే ఒరు మరమ్ వెట్టప్పుక, అత్తై ఎమ్బార్ కేట్టు, **“అల్లాళప్పెరుమాళే! ఈశ్వరవిభూతియై యழிక్కప్పార్ త్తాయో?”** ఎన్న, ఇవర్ శొల్లుమ్ వార్ త్తై కేట్కైక్కాక “ఈశ్వరవిభూతి యల్లాత విడముణ్డో”’ ఎన్న, “ఆవైపోలన్టుకాణ్ ఇవై, సార్వభౌమనాన రాజావుమ్, మహిషియుమాక, ముற்றுாట్టక క్కుడనీర్ వార్ త్తు ఆక్కుమ్ శోలైపోలే, పెరుమాళుమ్, పిరాట్టియారుమ్ కూడ క్కైత్తొట్టాక్కుమవై కాణ్” ఎన్టు అరుళిచ్చెయ్ దార్. ఉగందరుళిన నిలంగళిలే

మెయ్యే ప్రతిపత్తి విళైన్దార్ క్కు అంగుళ్ళవై ఎల్లామ్ ఉద్దేశ్యమాయ్ తోఱ్ఱుమిఱే".

(జననాథబ్రహ్మరాయుడు అనే ప్రభువు "తిరుముడి క్కూఱై" (శ్రీ రంగనాథుని శిరఃప్రదేశం వైపు ఉండే ఉభయ కావేరీ మధ్య దేశం) లో ఉండే ఒక వృక్షాన్ని నరికి వేయాలని ప్రయత్నం చేయగా, ఆ విషయాన్ని ఎంబార్ అనే ఆచార్యులు విని, " అల్లాళ ప్పెరుమాళ్! భగవంతుని సంపదను లేకుండా చేయాలని చూస్తున్నావా?" అని అన్నారు. ఆ ప్రభువు అప్పుడు వారు చెప్పే సమాధానం ఏమై ఉంటుందో తెలిసికోవాలనే ఆసక్తితో, " భగవంతుని విభూతి అనేది లేని చోటు ఒకటి ఉన్నదా ఏమి?" అని అడిగాడు. అప్పుడు ఎంబార్ " మిగిలిన విభూతివంటిదికాదు సుమా, ఇది. సార్వభౌముడైన ప్రభువు, అతని పట్టమహిషి, ఇద్దరూ కలసి కుండల నిండుగా నీటిని తెచ్చి, పెంచిన ఉద్యానవనంవంటిది ఇది. శ్రీ రంగనాథుడు, శ్రీరంగనాయకి కలసి, తమ చేతులతో తాకి పెంచబడిన తోటలు, ఇవి" అని బదులు చెప్పారు. భగవానుడు అభిమానించి వెలసి ఉండే దివ్యక్షేత్రాల విషయంలో యథార్థమైన ప్రతిపత్తిని కలిగినవారికి ఆ దివ్యదేశాలలో ఉన్నవి అన్నీ, భగవంతుని వలెనే, ఉద్దేశ్యమై ప్రకాశిస్తాయి కదా).

ఇక్కడ, నమ్బిళ్ళై భట్టర్ అనుగ్రహించిన ప్రస్తుతశ్లోకాన్ని ప్రమాణంగా గ్రహించడంలో ఉండే వేరొక ఔచిత్యాన్నికూడా ప్రస్తుతంలో అనుసంధించవలసి ఉన్నది. ఆళ్వారులవలెనే, భట్టర్ కూడా, శ్రీరంగరజస్తవాన్ని అనుగ్రహించిన సమయంలో శ్రీరంగనాథుని విరహం వల్ల చాలా క్లేశాన్ని పొందిన దశలో ఉన్నారు. వారి కాలంలో ఆ ప్రాంతాన్ని పరిపాలించిన ప్రభువు తమ మాటను కాదని, భాగవతాపచారాన్ని చేయడానికి ప్రయత్నించినందువల్ల, భట్టర్ మనసులో చాలా బాధపడి, ఇక శ్రీరంగంలోనే ఉండి, ఆ అకృత్యాన్ని చూడడం కంటే, శ్రీరంగాన్ని వదిలి, వేరొక చోటికి వెళ్లిపోవడం యుక్తం – అని తలచి, కొంతకాలం పాటు తిరుక్కోట్టియూర్

అనే దివ్యక్షేత్రంలో వాసం చేశారు. తరువాత కొంతకాలానికి ఆ ప్రభువు మరణించినట్లు తెలుసుకొని, మళ్లీ శ్రీరంగానికి వచ్చి, శ్రీరంగనాథుని సేవించాలనే అంతు లేని ఆర్తితో శ్రీరంగానికి తిరిగి వస్తూ, అప్పుడు తమకు కలిగిన అనుభవానికి పరీవాహరూపంగా ఈ శ్రీరంగరాజస్తవాన్ని ఆశువుగా అనుగ్రహించారు – అని సంప్రదాయకథనం. ఇంతటి ఆర్తితో ఉండే సమయంలో కూడా భట్టర్ కు పరమపదతుల్యమైన శ్రీరంగ దివ్యక్షేత్రంలో ఉండే చేతనాచేతనాలు అన్ని వైకుంఠంలో ఉండే నిత్యముక్తులుగా భాసించడంలో ఆశ్చర్యం ఏమున్నది? భట్టర్ అనుభవం ఆళ్వారుల అనుభవంవంటిదే కనుక, ఈ సామ్యాన్ని దృష్టిలో పెట్టుకుని నంబిళ్ళై ఈ శ్లోకాన్ని ఆళ్వారు సూక్తిని వివరించేటప్పుడు అర్థసంవాదంగా ఉదాహరించారు –అని గమనించవలసి ఉన్నది. ఇది అంతా భట్టర్ అనుభవం, ఆళ్వారు అనుభవంవలె, అతిగాఢమైనది అని తెలుపడంతోపాటు, ఈ ఇద్దరి అనుభవాలలోని సామ్యాన్ని నిశితంగా పరిశీలించి, దానికి తగినట్లుగా, ఆళ్వారుల సూక్తిని వివరించేటప్పుడు, భట్టర్ శ్లోకాన్ని ప్రమాణంగా ఉదాహరించే నంబిళ్ళైకు కల మేధాపాటవాన్ని, సమన్వయసామర్థ్యాన్ని కూడా స్పష్టం చేస్తుంది.

ఆళ్వారుల అనుభవం ఎంత గంభీరమైనదో, పూర్వాచార్యుల అనుభవం కూడా అంత గంభీరమైనదే అని, ఈ అనుభవాల సామ్యాన్ని గుర్తించగలిగినవారు కూడా మన పూర్వాచార్యులే అని, కేవలం దిఙ్మాత్రంగా నిరూపించడంకోసమే ఇంతటి వివరణ ఇక్కడ చేయబడింది. భట్టర్ సూక్తులకు సంబంధించిన ఇటువంటి ఉదాహరణలు దివ్యప్రబంధవ్యాఖ్యానాలలో చాలా సందర్భాలలో గోచరిస్తాయి.

★★★★★

శ్రీమతే రామానుజాయ నమః

# సంప్రదాయకోశగ్రంథాలు

★★★★

**కోశాన్ కల్పాగకల్పాన్ ప్రతిపదవివిధప్రార్థితార్థప్రదానే**
**దక్షాన్ విజ్ఞానవిత్తార్జనపరవిబుధైః సర్వదా సేవ్యమానాన్,**
**నానాశాఖాప్రవృద్ధాన్ దిశిదిశి వితతాం శ్చాక్షరైః పత్రపుష్పైః**
**సందేహాధ్యాసజన్యార్తిశమనకుశలాన్ ప్రాప్య ధన్యా భవామః.**

(ప్రతిపదంలోనూ కోరిన, అనేక విధాలైన అర్థాలను తెలియజేయడంలో సమర్థమైనవి, విజ్ఞానమనే ధనాన్ని అర్జించాలనే ఆసక్తి కలిగిన విబధులచే ఎల్లప్పుడూ సేవింపబడేవి, అనేక శాఖలో వృద్ధిని పొందినవి, అక్షరాలు అనే పత్రాలతో, పుష్పాలతో వ్యాప్తమైనవి, అర్థంలో సందేహం, విపర్యాసం – అనే వీటి వల్ల ఏర్పడిన ఆర్తిని తీర్చడంలో సమర్థమైనవి, అందువల్లనే, కల్పవృక్షంతో సమానమైనవి అయిన అయిన కోశగ్రంథాలను పొంది, మనం ధన్యులం అవుదాం)

★★★

సృష్టి ప్రారంభంలో, చేతనా చేతనాత్మకమైన ఈ జగత్తును సృష్టి చేసిన భగవానుడు, " నామరూపే వ్యాకరవాణి " అని వాటి నామరూప వ్యాకరణాన్ని కూడా చేశాడు. ఒక నిర్దిష్టమైన రూపాన్ని కలిగిన వస్తువునకు ఒక నిర్దిష్టమైన నామాన్ని కూడా నిర్దేశించాడు. ఇదే నిత్యమైన శబ్దార్థసంబంధం. అందువల్ల ఈ సృష్టి ఎంత ప్రాచీన మయినదో, ఈ శబ్దార్థ సంబంధం అనేది కూడా అంత ప్రాచీనమైనదే. వైదిక సిద్ధాంతం ప్రకారం, భాష అనేది అనాది, భగవద్దత్తమైనది కూడా. "సంస్కృతం నామ దైవీ వాగన్వాఖ్యాతా మహర్షిభిః" అనే సూక్తి కేవలం సంస్కృత భాషకు మాత్రమే

కాదు, అన్ని భాషలకు అన్వయిస్తుంది. భాషలన్నీ భగవంతుని ప్రసాదాలే. ఈ శబ్దార్థ సంబంధం "**అర్థో విష్ణు రియం వాణీ**" అని చెప్పినట్లుగా దివ్య దంపతుల సంబంధమే. అందువల్ల, పరమ పవిత్రమైనది. అవిభాజ్యమైనది.

శబ్దస్వరూపమైన వేదంలోని అర్థాన్ని అవగతం చేసుకోవడానికి మహర్షులు మనకు ఆరు వేదాంగాలను ప్రసాదించారు. శీక్ష, వ్యాకరణం, ఛందస్సు, జ్యోతిషం, నిరుక్తం, కల్పం అనేవి ఆ ఆరు అంగాలు.

వీటిలో, వ్యాకరణం, శబ్దాల బాహ్యరూపాన్ని తెలుసుకోవడానికి ఉపయుక్తమైనది కాగా,

నిరుక్తం అనేది శబ్దవ్యుత్పత్తిని తెలియజేసే వేదాంగం. వైదిక పదాల వ్యుత్పత్తిని గురించి తెలియజేసే ఈ నిరుక్తాన్ని యాస్క మహర్షి రచించాడు. దీనినిబట్టి, భాషాస్వరూపాన్ని అవగతం చేసుకోవడంలో ఆ భాషలోని పదాల వ్యుత్పత్తిని, వాటి ప్రయోగ వైవిధ్యాన్ని తెలియజేసే నిరుక్తి గ్రంథాల ఆవశ్యకతను భారతీయులు చాలా ప్రాచీన కాలంలోనే గుర్తించి, దానికి తగిన గ్రంథాలను రూపొందించినట్లు తెలుస్తున్నది. "సమామ్నాయః సమామ్నాతః, స వ్యాఖ్యాతవ్యః" అనే నిరుక్తంలో మొట్టమొదటి వచనం నిరుక్త గ్రంథాల ఆవశ్యకతను తెలుపుతున్నది. "**కోశవాన్ ఆచార్యః**" అనే ప్రసిద్ధమైన సూక్తిలోని కోశశబ్దానికి, సామాన్యమైన "**గ్రంథం**" అనే అర్థంతో పాటుగా, పదాల వ్యుత్పత్తిని ప్రయోగాన్ని తెలియజేసే నిరుక్తంవంటి కోశగ్రంథాలు– అనే అర్థంలో విశేషించి పర్యవసింప చేయడంలో కూడా ఏ విధమైన విప్రతిపత్తి ఉండదు కదా. ఎందుకంటే, భాషలో వ్యుత్పత్తిని సాధించడానికి ఈ నిఘంటు గ్రంధాల ఆవశ్యకత ఎంతటిదో పండితలోకానికి తెలియనిది కాదు.

ఈ నిరుక్తమే క్రమంగా తరువాతి కాలంలో, లౌకిక సంస్కృత భాషకు సంబంధించిన నిఘంటువులని, పదకోశములని చెప్పబడే శబ్దవ్యుత్పత్తిని, ప్రయోగ వైవిధ్యాన్ని తెలిపే గ్రంథాల నిర్మాణానికి కారణమైనది. ఇందువల్ల

కోశగ్రంథాల, నిఘంటు గ్రంథాల నిర్మాణం అనేది వేద కాలం నుండే ఆరంభమైనది, అందువల్ల ప్రాచీనమైనది. సంస్కృత భాషలో, అమరసింహుని "**నామలింగానుశాసనం**" అనబడే అమర కోశం ప్రాచీనమైన కోశగ్రంథం. ఇది చాలా ప్రసిద్ధమైనది. తరువాతి కాలంలో హేమాద్రి నిఘంటువు, వైజయంతీ నిఘంటువు, మేదినీనిఘంటువు, విశ్వప్రకాశం మొదలైన పలు నిఘంటు గ్రంథాలు సంస్కృతభాషలో ఆవిర్భవించాయి. ఈ కోశగ్రంథాలకు తరువాతి కాలంలో పలు భాషలలో పలు వ్యాఖ్యానాలు కూడా వెలిశాయి.

అయితే, అపుడు, ఈ కోశ, నిఘంటు గ్రంథాల నిర్మాణ పద్ధతి, ఈ నాటి పదకోశాల, నిఘంటువుల నిర్మాణ పద్ధతి వలె, అకారాది క్రమంలో ఉండేది కాదు. ఒక నిర్దిష్టమైన అర్థాన్ని తెలియజేసే పదాలు ఒక వరుసలో కూర్చబడేవి. అంటే, అక్షర క్రమాన్ని బట్టి కాక, పదాల అర్థాన్ని దృష్టిలో పెట్టుకొని ఈ కోశ గ్రంథాల సంకలనం జరిగింది. ప్రాచీన కోశ గ్రంథాల నిర్మాణం అంతా ఈ క్రమంలో జరిగినట్లే మనకు గోచరిస్తుంది. ఈ గ్రంథాలు అన్ని ఇంచుమించుగా శ్లోకాల, కారికల, సూత్రాల రూపంలోనే రచింపబడ్డాయి.

ప్రాచీన కాలంలో విజ్ఞానం అంతా, కంఠస్థంగా ఉండేది. ఆచార్యుని ద్వారా శిష్యుడు విని, మననం చేసి, ధారణ చేయడం ద్వారానే విద్యల పఠనపాఠనాలు సాగేవి. కారికల రూపంలో, సూత్రాల రూపంలో, శ్లోకాల రూపంలో గ్రంథాల రచన అనేది ఈ క్రమానికి ఉపయుక్తమై ఉండేది. అందువలన, అపుడు, కోశ గ్రంథాల రచన కూడా ఆ క్రమంలోనే సాగింది.

కాలం గడిచే కొద్దీ, ఈ కోశగ్రంథాలలో వైవిధ్యం ఏర్పడింది. క్రమంగా ఏకాక్షర నిఘంటువులు, నానార్థనిఘంటువులు మొదలైన క్రమాలలో, విభిన్నమైన దృక్కోణాలలో చాలా ప్రాచీన కాలంలోనే కోశగ్రంథాల నిర్మాణం జరిగింది.

విదేశీయ భాషలకు సంబంధించి కోశ గ్రంథాల నిర్మాణ కాలాన్ని, భారతీయ కోశ గ్రంథాల ఆవిర్భావ కాలాన్ని దృష్టిలో పెట్టుకుని చూస్తే, చాలా ఆధునికమైనదనే చెప్పాలి. శబ్ద నిరుక్తిని తెలిపే కోశ గ్రంథాలను ఆంగ్ల భాషలో "Dictionary" అని అంటారు ఈ పదం మొట్టమొదటగా క్రీస్తు శకం 1220లో "John of Garland" అను పేరును కలిగిన విదేశీయ పండితుడు కనిపెట్టాడు – అని ఆ భాషా పరిశోధకులు అంటున్నారు. ఇంగ్లీష్ భాషలో మొట్టమొదటగా, ఫ్రెంచ్, స్పానిష్, లాటిన్ భాషాపదాలకు సంబంధించిన వ్యుత్పత్తి ప్రయోగ వివరాలను తెలిపే కోశ గ్రంథాల నిర్మాణం జరిగింది. ఆ తరువాత, క్రమంగా ఈ కోశ గ్రంథాల నిర్మాణం మిగిలిన భాషలకు సంబంధించి కూడా చేయబడింది. ఈ విదేశీయ భాషలకు సంబంధించిన నిఘంటు గ్రంథాలు అన్నీ కూడా అకారాది అక్షర క్రమంలోనే కూర్చబడ్డాయి.

ఈ విధంగా ఉండే, ఈ రెండు విధాలైన కోశగ్రంథ నిర్మాణ క్రమాల మధ్య కనిపించే తారతమ్యానికి గల కారణాన్ని కూడా కొంత మనం అభ్యూహించవచ్చు. ఒక పదాన్ని గమనించి చూసినప్పుడు, నిర్దిష్టమైన కొన్ని వర్ణాల కలయిక వల్ల ఏర్పడే పదరూపం బాహ్యమైనది. అది పదానికి శరీరం వంటిది. ఆ పదం ద్వారా చెప్పబడే అర్థం అనేది అంతరమైనది, ఆ పదానికి ఆత్మ వంటిది. అందువల్లనే భగవానుడు "అర్థో విష్ణుః" అని చెప్పబడ్డాడు.

వైదికులైన భారతీయులందరి దృష్టిలో, వస్తువుల బాహ్యమైన రూపం కంటే, ఆ రూపంలో ఉండే ఆంతరమైన ఆత్మ అనేది ప్రధానమైనది. ఈ దృష్టిల, ప్రాచీన కాలంలో భారతీయ భాషలలోని కోశగ్రంథాల కూర్పు ఆత్మస్థానీయమైన పదాల అర్థాన్ని దృష్టిలో పెట్టుకొని చేయడం జరిగింది– అని. విదేశీయుల దృష్టిలో, ఆత్మకంటే, భౌతికమైన రూపానికే ప్రాధాన్యం ఎక్కువ కనుక, విదేశీయ భాషలలోని కోశగ్రంథాలలోని పదాల కూర్పు పదాల బాహ్యరూపాన్ని నిర్దేశించే వర్ణాల క్రమాన్ని దృష్టిలో పెట్టుకొని జరిగింది అని

మనం కొంత భావించవచ్చు. ఈ రెండు విధాలయిన క్రమాలు గొప్పవే, పాఠకులకు చాలా సహాయాన్ని ఇచ్చేవే. కాకపోతే, వారి వారి దృష్టినిబట్టి, కోశ గ్రంథాల కూర్పు జరిగింది, అంతే.

ఇక్కడ ఇంకో విషయాన్ని కూడా గమనించాలి. అకారాది క్రమంలో నిఘంటు నిర్మాణం అనేది అంత తేలికైన పని ఏమీ కాదు. దానికి భాషాపాండిత్యంతో పాటు సాంకేతికమైన పరిజ్ఞానం కూడా ఉండాలి. ఒక భాషలో ఈ క్రమంలో నిఘంటువును కూర్చాలి అంటే, భాషలో ఉండే పదాలను, వాటి అర్థాలను, వాటి ప్రయోగ వైవిధ్యాన్ని గుర్తించడంతోపాటుగా, ఆ విధంగా గుర్తించి సిద్ధం చేసుకున్న పదాలను అకారాది క్రమంలో కూర్చే ఒక విలక్షణమైన నైపుణ్యం కూడా ఉండాలి. ఈ విధమైన సాంకేతికమైన పరిజ్ఞానం అనేది విదేశీయులు అకారాది క్రమంలో కూర్చిన నిఘంటువుల నిర్మాణంతో ఆవిష్కృతమైనదని చెప్పాలి. ఈ దృష్టిలో వారు నిజంగా అభినందనీయులు.

విదేశీయులు మన భారతదేశానికి వర్తక వ్యాపారాల నిమిత్తం వచ్చినప్పుడు, తమ సౌకర్యం కోసం భారతీయ భాషలను ప్రత్యేకంగా ఆ భాషలకు మూలమైన సంస్కృతాన్ని అధ్యయనం చేయవలసిన అక్కర వారికి ఏర్పడింది. అప్పుడు మాక్స్ ముల్లర్, కాల్డ్ వెల్ మొదలైన విదేశీయ పండితులు భారతీయభాషలను అధ్యయనం చేసి, ఆ భాషలకు సంబంధించిన నిఘంటు గ్రంథాలను విదేశీయ భాషల కోశగ్రంథాల క్రమంలో రూపొందించారు. ఆ విధంగా వారు నిఘంటుగ్రంథాలను నిర్మించడం అనేది స్వలాభం కోసమే అయినా, అది మనకు కూడా పరోక్షంగా ఎంతో ఉపకరించింది. భాషల స్వరూపాన్ని వేరొక దృష్టితో అవలోకించి గ్రహించే అవకాశం ఏర్పడింది. తద్వారా వేరొక, ఉపయుక్తమైన క్రమంలో భారతీయ భాషలలోని కోశాల నిర్మాణం ఆవిష్కృతమైనది.

ఆ తరువాత జరిగిన భారతీయ భాషల కోశగ్రంథాల నిర్మాణం అంతా విదేశీయుల కోశ గ్రంథాల క్రమంలోనే, అంటే, అకారాది క్రమంలోనే జరిగింది. ఆ క్రమమే ఈనాటికీ కొనసాగుతున్నది. ప్రస్తుత పఠనపాఠనవ్యవస్థకు కూడా ఈ క్రమమే చాలా ఉపయుక్తమై ఉన్నది. కాలక్రమంలో, ప్రపంచంలో వ్యవహారంలో ఉండే భాషలన్నిటికీ ఇంచుమించుగా నిఘంటు గ్రంథాలు ఏర్పడినా, అవి అన్నీ ఈ అకారాదిక్రమంలోనే ఉన్నాయి.

సంస్కృత భాషకు సంబంధించి ఇప్పటికీ సుమారు 250 సంవత్సరాలకు ముందే "మోనియర్ విలియమ్స్" అనే ఆంగ్ల పండితులు కూర్చిన సంస్కృతాంధ్రనిఘంటువు అకారాది క్రమంలో వెలిసింది. తరువాతి కాలంలో, "V. S. Apte" మొదలైనవారు కూర్చిన సంస్కృతభాషానిఘంటువులు ఈ క్రమంలోనే ప్రచురింపబడ్డాయి. తెలుగు భాషలో కూడా, ఛార్లెస్ ఫిలిప్ బ్రౌన్ అనే విదేశీయ పండితుడు కూర్చిన నిఘంటువు ప్రసిద్ధమైనది. ఇది అకారాది క్రమంలోనే ఉన్నది. తర్వాత శ్రీబహుజన పల్లి సీతారామచార్యులవారు కూర్చిన శబ్దార్థ చంద్రిక మొదలైన ఎన్నో గ్రంథాలు వచ్చాయి. ఇవి కూడా ఈ అకారాది క్రమంలోనే ఉన్నాయి.

ఈ కోశగ్రంథాల కూర్పులోని వైవిధ్యం కూడా కాలక్రమేణ పెరిగింది. ఒకే భాషకు సంబంధించి, వేరు వేరు ప్రాంతాలలో వ్యవహారంలో ఉండే ఉపభాషల, మాండలిక భాషల పదకోశాలు, ఒక శాస్త్రానికి సంబంధించిన పదకోశాలు, ఒకే శాస్త్రంలో ఒక అంశానికి సంబంధించిన (అవ్యయ కోశాలవంటి) కోశగ్రంథాలు, అన్య భాషతో పరిచయాన్ని పెంచుకోవడానికి వీలుగా ఉండే సంస్కృతాంధ్ర, సంస్కృతాంగ్లాది నిఘంటువులు, బహుభాషా నిఘంటువులు, ప్రయోగాలతో పాటు వివరించే నిఘంటువులు – ఈ విధంగా కోశాల, నిఘంటు గ్రంథాల వైవిధ్యం విశ్వరూపాన్ని దాల్చిందని చెప్పాలి.

దీనివల్ల అన్యభాషలతో పరిచయాన్ని, పాండిత్యాన్ని సంపాదించుకునే అవకాశం జిజ్ఞాసుపాఠకులకు ఏర్పడింది.

ఈ కోశగ్రంథాల నిర్మాణం అనేది, కేవలం భాషను అధ్యయనం చేయడంలో మాత్రమే కాకుండా, అనేక విధాలైన అంశాలలో ప్రాధాన్యాన్ని కలిగి ఉన్నది. ఒక భాషకు సంబంధించిన కోశగ్రంథాలను, నిఘంటు గ్రంథాలను నిశితంగా అధ్యయనం చేసి చూసినప్పుడు, ఎన్నో విధాలయిన ప్రయోజనాలు సిద్ధిస్తాయి. ఆశ్చర్యకరమైన, అపూర్వమైన విశేషాలు వ్యక్తం అవుతాయి. ఒక భాష వ్యవహారంలో ఉండే ప్రాంతాలకు సంబంధించిన సంస్కృతి, సంప్రదాయాలు, వారి జీవనగతులు, కాలక్రమేణ ఆ భాషలో పదాల అర్థవ్యవహారంలో ఏర్పడిన మార్పులు, అన్య భాషల నుండి, ఆ భాషలోకి, పదాలు వ్యవహారం ద్వారా ప్రవేశించినప్పుడు, వాటిలో కలిగే మార్పులు, ఆ భాషను మాట్లాడే ప్రజలు నివసించే ప్రాంతాలకు సంబంధించిన చరిత్ర, విజ్ఞానం, సాహిత్యం, సామాజికమైన, సాంస్కృతికమైన, భాషాపరమైన ఇంకా పలు అంశాలు, ఆచారవ్యవహారాలు– ఈ విధంగా ఎన్నో అమూల్యమైన ఆసక్తికరమైన అంశాలను తెలుసుకోవడానికి ఆ భాషకు సంబంధించిన కోశాలు, నిఘంటుగ్రంథాలు చాలా ఉపయోగపడతాయి. వీటిలో మనకు కనిపించే విశేషాలు ఆ భాష వ్యవహారంలో ఉండే ప్రాంతానికి జాతికి సంబంధించిన చారిత్రకమైన పలు విశేషాలను నిరూపించడానికి సాటి లేని సాక్ష్యాలు అవుతున్నాయి.

## సంప్రదాయ నిఘంటు గ్రంథాలు

ఇంత కుముందు చెప్పిన ప్రస్తావించిన కోశగ్రంథాల, నిఘంటు గ్రంథాల వైవిధ్యం, మహత్త్వం, ప్రాధాన్యం ఒక వైపు ఉండగా, ఇప్పుడు

ముద్రింపబడుతున్న నిఘంటు గ్రంథంవంటి సంప్రదాయ నిఘంటు గ్రంథాల వైలక్షణ్యం అనితర సాధారణమైనది. దీనిని కొంచెం విజ్ఞాపిస్తాను.

వేదాలు, వాటి నిర్ణయ భాగాలుగా చెప్పబడే వేదాంతాలు, వాటిని వివరించే శ్రీరామాయణం, మహాభారతం, పురాణాలు, ఉపపురాణాలు, బ్రహ్మసూత్రాలు, వాటి వ్యాఖ్యానాలు మొదలైనవి అన్నీ సంస్కృత వేదాంతంగా చెప్పబడుతున్నాయి. ఈ వేదవేదాంతాదులలో, వాటి ఉపబృంహణాది గ్రంథాలలో ప్రతిపాదింపబడే అర్థతత్వాలను తెలియజేస్తూ ప్రాంతీయమైన మధురమైన, ద్రావిడ భాషలో ఆళ్వారులు అనబడే, మహర్షులవంటి దివ్యసూరులు ద్రావిడ భాషలో దివ్య ప్రబంధాలను వెలయించారు. వీటికి నాలాయిర దివ్య ప్రబంధం అని, ద్రావిడ వేదం అని పేరు. ఈ ప్రబంధాలలో శ్రీమన్నారాయణుడే పరతత్వమనే వైదికసిద్ధాంతం ప్రతిపాదింపబడింది.

ఈ సందర్భంగా వేరొక విషయం కూడా ఇక్కడ గమనించవలసి ఉన్నది. భారతదేశంలో అనాదికాలంగా వ్యవహారంలో ఉండే భాషలన్నిటికీ సంస్కృత భాష మూలమైనది. కాలక్రమేణ ఈ సంస్కృత భాష నుండి ఎన్నో ప్రాకృత భాషలు పుట్టాయి. వాటి నుండి, ఇప్పుడు ఉత్తర భారత దేశంలో వ్యవహారంలో ఉండే, పంజాబీ, మరాఠీ, బెంగాలీవంటి ప్రాంతీయ భాషలు పుట్టాయి. అందువల్ల ఉత్తర భారత దేశంలో వ్యవహారంలో ఉండే భాషలన్నీ సంస్కృత జన్యాలే. ఇక, దక్షిణ భారతదేశంలో వ్యవహరింపబడే ఆంధ్రం, ద్రావిడం, కన్నడం, మలయాళం వంటి భాషలు ద్రావిడభాషా కుటుంబానికి చెందినవి – అనే విదేశీయుల వాదం ఒకటి అటు ఉండగా, ఈ భాషలన్నీ కూడా సంస్కృతం నుండి పుట్టినవే – అని చాలా బలంగా శ్రీ చిలుకూరి నారాయణరావుగారు మొదలైన భాషాపండితులు చాలామంది వాదించారు. ఇందులో వాస్తవం అనేది ఏదైనా, దక్షిణ భారతంలో ఈనాడు వ్యవహారంలో ఉండే అన్ని భాషలు సంస్కృత భాషా ప్రభావాన్ని పూర్తిగా కలిగినవి – అనే

విషయం నిర్వివాదం, ఎవరూ కాదనడానికి వీలు లేని సత్యం. మిగిలిన దక్షిణదేశీయభాషలు అన్నిటి కంటే సంస్కృతానికి చాలా దూరమైనది – అని చెప్పబడే ద్రావిడ భాషలో కూడా, నిశితంగా పరిశీలించి చూస్తే, కనీసం 50 శాతం పదాలు సంస్కృత భాషను మూలంగా కలిగినవి అని ఆ భాషాపండితులే అంగీకరిస్తున్నారు. అందువల్ల, ఆళ్వారుల దివ్య ప్రబంధాలు ద్రావిడ భాషలో రచింపబడినప్పటికీ, ఆ ప్రబంధాలలో ఎన్నో పదాలు సంస్కృత పదాలుగా కానీ, లేక, సంస్కృత పద జన్యాలుగా కానీ, గోచరిస్తాయి. మలయాళ భాషలో, ఆంధ్రభాషలో ఈ సంస్కృత భాషా ప్రభావం ఇంచుమించుగా పరిపూర్ణం అని చెప్పాలి. ఆంధ్రభాషలో ఎన్నో సంస్కృత పదాలు తత్సమాలుగా, తద్భవాలుగా సాక్షాత్కరిస్తాయి. సంస్కృత భాషా వైభవం, ప్రాచుర్యం అంత గొప్పది.

ఆళ్వారులు అనుగ్రహించిన దివ్య ప్రబంధాలను భగవద్రామానుజుల కాలంలో, వారికి అనంతర కాలంలో జీవించిన పలువురు శ్రీవైష్ణవ సంప్రదాయానికి సంబంధించిన పూర్వాచార్యులు మణిప్రవాళ శైలిలో వ్యాఖ్యానాలను వెలయించారు. మణి ప్రవాళ శైలి అనేది విలక్షణమైన శైలి. ఇది సంస్కృత, ద్రావిడ భాషలలోని పదాల మేలు సమ్మేళనంతో ఏర్పడిన క్రమమైన శైలి. ఈ శైలి మలయాళ సాహిత్యంలో కూడా ప్రచురంగా గోచరిస్తుంది. ఈ శైలిలో, ఆ సాహిత్యంలో పలు గ్రంథాల రచన కూడా చేయబడింది.

ఈ శైలిని శ్రీవైష్ణవ సంప్రదాయంలోని పూర్వాచార్యులు తమ దివ్య ప్రబంధాల వ్యాఖ్యాన రచనకు ఎన్నుకోవడంలో కొన్ని కారణాలు ఉన్నాయి. ఇంతకు ముందు చెప్పినట్లుగా శ్రీవైష్ణవ సంప్రదాయంలో, వేదాలు, వాటి అర్థాన్ని వివరించే ప్రస్థానత్రయాది గ్రంథాలు ఎంత ప్రమాణమో, వేదార్థాలను ప్రతిపాదించే ఆళ్వారుల దివ్య ప్రబంధాలు కూడా ఆ వేదాల వలె ప్రమాణాలే. అందువల్ల, ఆ సంప్రదాయానికి ఉభయ వేదాంత సంప్రదాయం అని పేర.

సంస్కృత **"వేదంలో ప్రతిపాదింపబడిన తత్వాలే ద్రావిడ వేదంగా పరిగణింపబడే ఆళ్వారుల దివ్య ప్రబంధాలలో కూడా వివరింపబడ్డాయి"** అనేతమ సంప్రదాయాన్ని శ్రీవైష్ణవ పూర్వాచార్యులు తమ వ్యాఖ్యానాల ద్వారా నిరూపించడానికి సాటి లేని ప్రయత్నం చేశారు. అందులో సాఫల్యాన్ని పొందారు కూడా. వారు అళ్వారుల ప్రబంధాలను వ్యాఖ్యానించిన తీరులో మిగిలిన ఏ భాషా సాహిత్యానికి అటువంటి వ్యాఖ్యానాలు ఏర్పడలేదని చెప్పాలి.

వారు, ఈ వ్యాఖ్యానాలను రచించేటప్పుడు, తమ సంప్రదాయాన్ని, అభిప్రాయాలను ప్రతిపాదించడానికి, నిరూపించడానికి, ఆవశ్యకమైన సంస్కృత వైదిక ఉపబృంహణాది గ్రంథాల నుండి పలు ప్రమాణాలను ఉట్టంకించవలసిన ఆవశ్యకత ఏర్పడింది. ఆ ప్రమాణాలు అన్నీ వైదిక భాషలోనూ, సంస్కృత భాషలోను ఉన్నందున, తమ వ్యాఖ్యానాలను ద్రావిడ భాషలో రచించినప్పటికీ, ఆ వ్యాఖ్యానాల మధ్యలో ప్రమాణీకరించవలసిన ఆ ప్రమాణ వాక్యాలను యథాతథంగా ఉట్టంకించవలసిన ఆవశ్యకత ఏర్పడింది. అందువల్ల వారు, మధ్య మధ్యలో వైదిక భాషలో, సంస్కృత భాషలో ఉండే పలు ప్రమాణాలను యథాతథంగా ఉదాహరించి, వాటి అర్థాన్ని వివరిస్తూ వ్యాఖ్యానాన్ని చేసేటప్పుడు, మధ్య మధ్యలో సంస్కృత పదాల ప్రయోగాన్ని కూడా చేయవలసిన ఆవశ్యకత ఏర్పడింది. అపుడు వారు, సంస్కృత ద్రావిడ పదాల కలయిక వల్ల ఏర్పడిన ఈ మణిప్రవాళ శైలిని తమ వ్యాఖ్యానానికి అనువైనదిగా నిర్ణయించుకుని, ఆ శైలిలో తమ వ్యాఖ్యాన గ్రంథాలను రచించారు.

ద్రావిడ ప్రబంధాలను వ్యాఖ్యానించిన శ్రీవైష్ణవ సంప్రదాయానికి చెందిన పూర్వాచార్యులు అందరూ, సంస్కృత భాషలోనూ ద్రావిడ భాషలోనూ, రెండు భాషలలోనూ కూలంకషమైన పాండిత్యాన్ని కలిగినవారు కావడం వల్ల, వారికి తమ వ్యాఖ్యాన రచనలో ఈ శైలిని ప్రయోగించడంలో ఏ

విధమైన క్లేశం ఏర్పడలేదు. విశేషం ఏమంటే, తరువాతి కాలంలో శ్రీవైష్ణవ సంప్రదాయానికి సంబంధించిన పలువురు ఆచార్యులు రచించిన అనేక స్వతంత్ర గ్రంథాలు, రహస్య గ్రంథాలు ఈ మణిప్రవాళ శైలిలోనే రచింపబడ్డాయి. సమర్థుడైన శిల్పి మణులతో, పగడాలతో పొదిగిన హారం చూపరులకు మనోజ్ఞంగా ఉండేటట్లుగా, ఉభయ భాషలలోనూ పారంగతులైన శ్రీవైష్ణవ పూర్వాచార్యులు ప్రయోగించిన ఈ మణిప్రవాళ శైలి కూడా ఏమాత్రం కృతకంగా కాకుండా, మధుర మనోజ్ఞంగా, ఆస్తికపాఠక హృదయ రంజకంగా ఉంటుంది.

ఈ మణిప్రవాళ శైలిలో రచింపబడిన మొట్టమొదటి వ్యాఖ్యాన గ్రంథం – తిరువాయ్ మొళి దివ్య ప్రబంధానికి భగవద్రామానుజుల ముఖ్య శిష్యులలో ఒకరు, వారికి జ్ఞాన పుత్రులని ప్రసిద్ధి చెందినవారైన తిరుక్కురుకై ప్పిరాన్ పిళ్ళాన్ రచించిన ఆఱాయిరప్పడి గ్రంథం. ఈ వ్యాఖ్యాన శైలి సంస్కృత పదప్రచురంగా, నన్నయ భారతాంధ్రీకరణ శైలితో పోలి ఉంటుంది. కాని, ఆ తరువాత వచ్చిన వ్యాఖ్యానాలు, ఆ విధంగా కాకుండా, ద్రావిడ పదాల ప్రాచుర్యంతో తిక్కన శైలిలో గోచరిస్తాయి. పిళ్ళాన్ కాలం క్రీస్తు శకం 1062 అని అంటున్నారు.

శ్రీనాథమునుల కాలంలో శ్రీరంగ దివ్యాలయంలో ఏర్పడిన అరైయర్ సేవలో, అరైయర్ స్వాములు అనుసంధానం చేసే, కొన్ని దివ్యప్రబంధ పాశురాలకు వ్యాఖ్యాన రూపమైన తంబిరాన్ పడి వ్యాఖ్యానాలు కూడా ఈ మణి ప్రవాళ శైలిలోనే ఉన్నవి. ఈ వ్యాఖ్యానాలు నాథమునుల కాలంలోనే ఆవిర్భవించాయి అని, ఆ కాలంనుండే ఇవి అరైయర్ అనుసంధానంలో ఉన్నాయి – అని శ్రీమాన్ వెంకటరామన్ గారు “అరైయర్ సేవై” అనే ద్రావిడ గ్రంథంలో తెలియజేశారు. దీనిని బట్టి, ఈ శైలి నాథమునుల కాలంనాటిది అని భావించవలసి ఉంటుంది. ఒకవేళ, అవి తర్వాతి కాలంలో, అంటే

రామానుజుల కాలానికి తరువాత కాలంలో ఏర్పడ్డాయి అని భావిస్తే, పిరాన్ రచించిన ఆఱాయిరప్పడి వ్యాఖ్యానం మొట్టమొదటి ప్రవాళశైలిలో రచింపబడిన సంప్రదాయ వ్యాఖ్యాన గ్రంథం అని భావించవలసి ఉంటుంది. అప్పుడు ఈ శైలి, సంప్రదాయంలో రామానుజుల కాలంలో, వారి అనుమతితో, ప్రియ వైష్ణవ సంప్రదాయ వ్యాఖ్యానవాఙ్మయంలో ప్రవేశించింది – అని చెప్పాలి.

భాష అనేది జీవనదివంటివి. అది ఎప్పటికీ కొనసాగుతూ, కాలానుగుణంగా, దేశానుగుణంగా, తన గతిని, స్వరూపాన్ని మార్చుకుంటుంది. ఇప్పటికి సుమారు 800, 900 సంవత్సరాలు క్రితం ఉండే, మణిప్రవాళ భాషలో రచింపబడిన సంప్రదాయ దివ్యప్రబంధ వ్యాఖ్యానాలు ఇప్పటి పాఠకులకు సులభంగా అర్థం గ్రహించడానికి వీలుగా ఉండవు. పాఠకులు ద్రావిడ ప్రాంతానికి చెందినవారైనా, కాలాన్ని బట్టి భాషలో, ప్రయోగాలలో వచ్చిన మార్పుల వల్ల, అప్పటి భాష, ప్రయోగాలు సులభంగా అర్థం కావు. ఇక, ఆంధ్ర పాఠకుల విషయంలో అయితే చెప్పవలసిన పని లేదు.

ఇంతే కాక, ద్రావిడ భాషను తెలిసినవారికి అందరికీ సంస్కృత భాష తెలియకపోవచ్చు. సంస్కృత భాషను తెలిసినవారికి అందరికీ ద్రావిడ భాషలో పరిచయం లేకపోవచ్చు. సంప్రదాయ సాహిత్యపరిచయం ఉంటే తప్ప, ఆయా ప్రయోగాలలో ఉండే వైలక్షణ్యం అవగతం కాదు. ఈ కారణాలచే కూడా, ఈ వ్యాఖ్యానాలలో ప్రయోగింపబడిన అపూర్వమైన, సాంప్రదాయికమైన పదాల, పద సందర్భాల అర్థాలను వివరించే గ్రంథనిర్మాణాల ప్రయత్నం చేయవలసిన ఆవశ్యకత ఏర్పడింది. దాని ఫలమే అరుంబద వివరణల ఆవిష్కారం.

## సంప్రదాయకోశగ్రంథాలు

ఆళ్వారుల దివ్య ప్రబంధాలకు పూర్వాచార్యులు వెలయించిన వ్యాఖ్యానాలలో చోటు చేసుకున్న సాభిప్రాయకమైన ప్రయోగాలకు, అపూర్వమైన పదప్రయోగాలకు వివరణలను అందిస్తూ పెద్దలు అరుంబద వివరణలను ఆవిష్కరించారు. తిరువాయ్ మొళి దివ్యప్రబంధానికి నంబిళ్ళై అనే పూర్వాచార్యులు అనుగ్రహించిన ఈడు అనే విస్తృతమైన వ్యాఖ్యానానికి అడైయవళైందాన్ అరుంబదం, జీయర్ అరుంబదం– అనే రెండు అరుంబదవివరణలు ఉన్నాయి. వీటిలో, మొదటిది, పలువురు కలసి కూర్చినది కాగా, రెండవది, ఏకకర్తృకం. తిరుప్పావై ప్రబంధానికి పెరియ వాచ్చాన్ పిళ్ళై అనుగ్రహించిన మువాయిర ప్పడి వ్యాఖ్యానానికి మూడు అరుంబదాలున్నాయి. ఆ విధంగానే, తిరువిరుత్త ప్రబంధానికి పెరియ వాచ్చాన్ పిళ్లై అనుగ్రహించిన వ్యాఖ్యానానికి కూడా మూడు అరుంబదాలు ఉన్నాయి. ఇవేకాక, ఇంచుమించుగా మిగిలిన అన్ని ఆళ్వారుల ప్రబంధాల వ్యాఖ్యానాలకు కూడా పూర్వాచార్యులు కూర్చిన అరుంబదాలు ఉన్నాయి. ఇవన్నీ ఆ వ్యాఖ్యానాలలో ఉండే విశేషాలను, కఠిన పదాల అర్థాలను, అపూర్వ ప్రయోగాలలోని ఆంతర్యాలను తెలియజేస్తూ, కొన్ని అపూర్వమైన విషయాలను తెలుపుతున్నాయి.

ఈ అరుంబదాలలో, ఆయా ప్రబంధాల వ్యాఖ్యానాలలో ఉండే అర్థవిశేషాలను వివరించడంతో పాటు, కొన్ని చోట్ల చేయబడిన వివరణలు అపూర్వమైనవి. ప్రత్యేకించి, తిరువాయ్ మొళి ఈడు వ్యాఖ్యానానికి గల అరుంబదాలలోని వివరణ విశేషాలు గమనించదగినవి. వ్యాఖ్యానంలో ఉండే ఇంచుమించు ప్రతి వాక్యానికి కానీ, వాక్య సమూహానికి కానీ, ఈ అరుంబద వివరణలలో అవతారికలు కనిపిస్తాయి. ఈ అవతారికలు వ్యాఖ్యానంలోని ఆ వాక్యాలు లేక వ్యాఖ్య సమూహాలు ఎందుకు అవతరించాయో తెలియజేస్తూ, వాటి సార్థక్యాన్ని సర్వదా నిరూపిస్తాయి. అందువల్ల ఇవి పదాల వివరణలను

తెలిపే కేవలం నిఘంటువులు మాత్రమే కాదు, అంతకుమించినవి. టిప్పణుల వంటివి. ఈ అరుంబదాలలో, వివరణ కోసం, ఆవశ్యకమైతే, వ్యాఖ్యానంలో ఉట్టంకింపబడని ప్రమాణాలు, కొన్నిచోట్ల వాటి వివరణలు కూడా ఇవ్వబడ్డాయి. ఈ అరుంబదాల శైలి ఇంచుమించుగా భగవద్రామానుజ శ్రీభాష్యానికి వివరణంగా అవతరించిన శ్రుతప్రకాశికా వ్యాఖ్యాన శైలిని పోలి ఉంటుంది.

ఈ అరుంబదవివరణల నిర్మాణం అనేది కేవలం ఆళ్వారుల దివ్య ప్రబంధ వ్యాఖ్యానాలకు పూర్వాచార్యులు రచించిన మణిప్రవాళ వ్యాఖ్యానాల వరకే పరిమితం కాలేదు. క్రమంగా ఈ అరుంబద వివరణల కూర్పు రహస్య గ్రంథాల వ్యాఖ్యానాలకు కూడా ఏర్పడింది. శ్రీపిళ్ళలోకాచార్యులవారు అనుగ్రహించిన ముముక్షుప్పడి, శ్రీవచన భూషణం అనే రహస్య గ్రంథాలకు శ్రీ వరవరమునులు అనుగ్రహించిన ద్రావిడ వ్యాఖ్యానాలకు కూడా తర్వాతి కాలంలో అరుంబదాలు వెలిశాయి. ముముక్షుప్పడి వ్యాఖ్యానానికి దొడ్డయాచార్య స్వామి వారి అరుంబదం, ఎంబార్ జీయర్ అరుంబదం ప్రసిద్ధమైనవి. శ్రీ వచన భూషణ వ్యాఖ్యానానికి "అణ్ణా వప్పంగార్" అని ప్రదాయంలో ప్రసిద్ధులైన శ్రీవాధూల వీర రాఘవాచార్యస్వామివారు కూర్చిన అరుంబదవివరణం చాలా విశదమైనది. అద్భుతమైనది కూడా.

కాలం గడిచే కొద్దీ, వ్యుత్పత్తి దౌర్బల్యం వల్ల, భాషలలో ఏర్పడే మార్పుల వల్ల, దివ్యప్రబంధాల వ్యాఖ్యానాలను అవగతం చేసుకోవడానికి ఈ అరుంబద వివరణల సహకారం కూడా చాలని స్థితి ఏర్పడింది. ఆళ్వారుల ప్రబంధాలలో, వాటి వ్యాఖ్యానాలలో, అరుంబదాలలో ఉండే, సులభంగా అవగతం కాని పదాలకు, ప్రయోగాలకు వివరణలు ఆవశ్యక మయ్యాయి. వాటికి తగినట్లుగా, ఆధునిక క్రమంలో, నిఘంటువుల నిర్మాణావశ్యకత ఇటీవల కాలంలో చాలా ఏర్పడింది. దీనికి కూడా తగిన ప్రయత్నాలు ఈ

మధ్యలో జరిగాయికూడా. ద్రావిడలిపిలో, ఆంధ్రలిపిలో కూడా ఇటువంటి నిఘంటువుల ప్రకాశనం జరిగింది.

1963వ సంవత్సరంలో శ్రీరంగం స్థానికం శ్రీమాన్ పార్థసారథి అయ్యంగారి స్వామివారు కూర్చిన నాలాయిర దివ్య ప్రబంధ అకరాది గ్రంథం ద్రావిడ భాషలో ముద్రింపబడింది. ఇది చాలా గొప్ప నిఘంటుగ్రంథం. దివ్యప్రబంధ వ్యాఖ్యానాలలో ఎదురయ్యే కఠిన పదాలకు అర్థాలతో పాటు, ఏ యే అర్థాలలో ఏ యే పదాలు ఎక్కడెక్కడ ప్రయోగింపబడ్డాయో కూడా, ఈ అకరాదిలో తెలుపబడ్డాయి.

ఇక్కడ ప్రసంగవశాత్తు ఒక విషయం. ద్రావిడ భాషకు సంబంధించిన ఎన్నో పదకోశాలు ఇంతకు ముందే ఆవిర్భవించినవికదా? కొత్తగా, ఈ సంప్రదాయాన్ని నిఘంటు గ్రంథాల ఆవశ్యకత ఏమి ఉన్నది? అనే సందేహం కలుగవచ్చు. కాని, ద్రావిడ భాష సాహిత్య సామాన్యాన్ని దృష్టిలో పెట్టుకుని కూర్చబడిన నిఘంటు గ్రంథాలకు, శ్రీవైష్ణవ సంప్రదాయ సాహిత్యనిఘంటు గ్రంథాలకు మధ్య చాలా వ్యత్యాసం ఉన్నది, ద్రావిడ భాషకు సంబంధించ సామాన్యంగా కూర్చిన పదకోశాలు ద్రావిడ సాహిత్యాన్ని సాధారణంగా దృష్టిలో పెట్టుకొని ఏర్పడినవి. కానీ, శ్రీవైష్ణవ సంప్రదాయానికి చెందిన దివ్య ప్రబంధ అకరాదిగ్రంథాలు, విశేషించి, ఆళ్వారుల దివ్య ప్రబంధాలను, వాటికి పూర్వాచార్యులు వెలయించిన మణిప్రవాళ వ్యాఖ్యానాలను దృష్టిలో పెట్టుకొని కూర్చబడినవి. ఈ నిఘంటువులలో కనిపించే వివరాలు, విశేషాలు అన్నీ సాధారణంగా కూర్చిన నిఘంటు గ్రంథాలలో గోచరించవు. అందువల్ల ఈ సంప్రదాయ నిఘంటు గ్రంథాల కూర్పు పిష్ట పేషణంవలె వ్యర్థం కాదు, చాలా ఆవశ్యకమైన కార్యం, గొప్ప కార్యం.

సుప్రసిద్ధ ఉభయ వేదాంత విద్వాంసులు శ్రీమాన్ ఎం వరదరాజన్ స్వామివారు 2000వ సంవత్సరంలో ఒక నాలాయిర దివ్య ప్రబంధ అకరాదిని

ప్రచురించారు. ఇది కూడా చాలా ఉపయుక్తమైన గ్రంథం. మద్రాస్ యూనివర్సిటీవారు ఇంకొక నాలాయిర దివ్యప్రబంధ నిఘంటువును ముద్రించారు. 2001 వ సంవత్సరంలో "శాంతి సాధన" అనే సంస్థ ద్వారా "వైణవ ఉరై నడై వరలాఱ్ఱుముఱై తమిళ్ పేరకరాది" అనే పేరుతో, మూడు సంపుటాలలో, నాలాయిర దివ్య ప్రబంధ వ్యాఖ్యానాలలో ఉండే అపూర్వమైన పదాలను, ప్రయోగాలను సోదాహరణంగా వివరించే, పూర్వం ఎప్పుడో సిద్ధం చేయబడి వ్రాతప్రతిలో చాలా కాలం రహస్యంగా గుప్తంగా పడి ఉన్న ఒక గొప్ప నిఘంటువును ప్రచురించారు.

ఇటువంటి సంప్రదాయ నిఘంటువుల ద్వారా దివ్య ప్రబంధ వ్యాఖ్యానాలను అధ్యయనం చేసేవారికి కలిగే ప్రయోజనాన్ని ఒక ఉదాహరణలతో ప్రస్తావిస్తాను.

ద్రావిడ భాషలో "**కణ్**" అనే ఒక పదం ఉన్నది. దీనికి సామాన్యంగా కన్ను – అని వాచ్యార్థం. కానీ, ఈ పదం ఇంకా చాలా అర్థాలలో దివ్య ప్రబంధ వ్యాఖ్యానాలలో ఉపయోగించబడినట్లుగా కనిపిస్తుంది. ఈ అర్థాలన్నీ ఆయా సందర్భాలను బట్టి స్ఫురిస్తున్నాయి. ఉదాహరణకు దివ్యప్రబంధవ్యాఖ్యానాలలో ఈ పదానికి స్ఫురించే మరికొన్ని అర్థాలను గమనిద్దాం.

"**కణ్**" అంటే, రక్షకం –అని అర్థం. ఈ పదానికి ఈ అర్థం తిరువాయ్ మొళి దివ్యప్రబంధానికి కల ఈడు వ్యాఖ్యానంలో (2–2–1) "**మాలై కణ్ ఎన్నిరుప్పార్ క్కు అల్లాదదెల్లామ్ మాలై క్కణ్ణాయ్ తోఱ్ఱుమిఱే**" (సర్వేశ్వరుడే రక్షకుడు అని భావించేవారికి మిగిలినది అంతా కూడా చూపు లేనిది గానే, అంటే, అరక్షకంగానే తోస్తుంది కదా) అనే ప్రయోగంలో కనిపిస్తుంది.

"**కణ్**" అంటే, నెమలి కన్ను – అని అర్థం. ఈ అర్థాన్ని, పైన ప్రస్తావించిన సందర్భంలోనే ఈడు వ్యాఖ్యానంలో "**పీలిక్కణ్ ఎన్ఱు వ్యవహరియానిన్ఱదిఱే**" (నెమలి కన్ను అని వ్యవహరింపబడుతున్నది కదా) అనే ప్రయోగంలో గమనించవచ్చు.

"**కణ్**" అనే పదానికి సప్తమీ విభక్తి ప్రత్యయంగా కూడా ప్రయోగం ఉన్నది. నమ్మాళ్వారులే "**అఱియాక్కాలత్తుళ్ళే అడిమై క్కణ్ అన్బు శెయ్విత్తు**" (జ్ఞానం ఏర్పడని కాలంనుండే దాస్యంలో అభినివేశాన్ని కలిగించి) అని ప్రయోగించారు.

"**కణ్**" అంటే, కణుపు – అని కూడా అర్థం. ఈ అర్థం ఈడు వ్యాఖ్యానంలో "**ఇరండు కణ్ణేఱి, అదుక్కు త్తక్క**" (7–9–6) రెండు కణుపులు ఏర్పడి, దానికి తగినట్లుగా) అనే సందర్భంలో గోచరిస్తుంది.

"**కణ్**" అంటే, దయ– అని అర్థం. ఈ అర్థం, "**కణ్ణற்றழிయ చ్చెయ్యుమ్ పెరియ తిరువడియై నడత్తి**" (9–2–6) (దయ లేకుండా ప్రవర్తించే గరుడని నడిపి) అనే సందర్భంలో కనిపిస్తుంది.

"**కణ్**" అంటే చోటు – అని అర్థం. "**కణ్ణార్ కడల్ –ఎన్లైయాలే ––ఇడముడైత్తాన కడల్ –ఎన్నుదల్**". (శిఱియ తిరుమడల్) (కణ్ణార్ కడల్– అనే అన్నందు వల్ల పెద్ద చోటును కలిగిన సముద్రం అని అర్థం అని చెప్పవచ్చు) అనే పెరియ వాచ్చాన్ పిళ్ళై సూక్తిలో చూడవచ్చు. ఇటువంటి ఉదాహరణలను ఎన్నో గమనించవచ్చు. గ్రంథ విస్తృతిభయంవల్ల ఇంతమాత్రంతో విరమిస్తున్నాను.

ఈ విధంగా వేరు వేరు అర్థాలలో ఒకే పదం దివ్య ప్రబంధాలలో, వాటి వ్యాఖ్యానాలలో ఎక్కడెక్కడ ఏ విధంగా ప్రయోగింపబడింది అనే విచికిత్సకు ఈ నిఘంటువులు చాలా ఉపకరిస్తాయి.

ఇటువంటి, చాలా ఉపయుక్తమైన ఈ సంప్రదాయ నిఘంటుగ్రంథాలకు అన్నిటికీ తెలుగులో అనువాదం రావలసి ఉన్నది. ఇవి కాక, సుప్రసిద్ధ ద్రావిడ పండితులు శ్రీ స్వామినాథ అయ్యర్ కూర్చిన నాలాయిర దివ్య ప్రబంధాలలోని కఠినమైన పదాలకు ఒక నిఘంటువు ఉన్నది. ఇంకా, దివ్యప్రబంధాలలో ఉండే పదాల అర్థాలను తెలిపే నిఘంటువులుకూడా మరికొన్ని ఉన్నాయి.

ఇక, తెలుగులో ప్రచురింపబడిన సంప్రదాయ నిఘంటు గ్రంథాలను చూసినప్పుడు, ఇప్పటికి సుమారు 130 సంవత్సరాల క్రితం, శ్రీవైష్ణవ గ్రంథముద్రాపక సభ ద్వారా "సంప్రదాయ అకరాది" అనే ఒక నిఘంటువు ముద్రింపబడింది. ఇందులో ఉండే పదాలు అచ్చుల వరకు మాత్రమే ఉన్న ముద్రింపబడి ఉన్నాయి. ఈ కోశంలో దివ్యప్రబంధ వ్యాఖ్యానాలలో ప్రయోగింపబడిన సంస్కృత ద్రావిడ పదాలకు అర్థాలు తెలుపబడ్డాయి.

ఇప్పటికి సుమారు 90 సంవత్సరాల క్రితం ముముక్షుప్పడి, తత్త్వ త్రయం, శ్రీవచన భూషణం, ఆచార్య హృదయం మొదలైన పలు సంప్రదాయ గ్రంథాలకు, దేశికుల గ్రంథాలకు, భగవద్రామానుజుల శ్రీభాష్య గ్రంథానికి, తిరుప్పావై మువాయిరప్పడి, ఆఱాయిర ప్పడి వ్యాఖ్యానాలకు తెలుగులో అనువాదాలను చేసి, ముద్రించి, మహోపకారం చేసిన కావ్య తీర్థ రత్న మొదలైన బిరుదాలను కలిగిన శ్రీమాన్ కందాడై శేషాచార్యులవారు ఒక సంప్రదాయ నిఘంటువును తెలుగులో ముద్రించారు. ఇందులో సంప్రదాయ గ్రంథాలలో, దివ్య ప్రబంధ వ్యాఖ్యానాలలో ఉండే కఠినమైన పదాలకు అర్థాలు తెలుపబడ్డాయి. ఇది చాలా ఉపయుక్తమైన గ్రంథం. తిరిగి ముద్రణను చేయవలసిన గ్రంథం.

★★★★★

# ఛాందోగ్యోపనిషత్తు– శ్రీరామాయణం – తిరువాయ్ మొళి

★★★★

**సర్వాకర్షకసుందరత్వముఖసౌగుణ్యాశ్రయే విగ్రహే**
**సర్వాంగేషు హరేః సరోజనయనే భాత స్తరాం రోచిషా,**
**ఏతత్తత్త్వ ముదీరితం మహదహో! ఛాందోగ్యవాక్యే, తథా,**
**శ్రీరామాయణవాక్యత శ్చ, శఠజిద్గాథాస్ఫురత్సద్గిరా.**

★★★★

సామవేదానికి సంబంధించిన ఛాందోగ్యోపనిషత్తు సూర్యమండలాంతర్వర్తి అయిన పరమాత్మ దివ్యమంగళ విగ్రహాన్ని కీర్తిస్తూ “య ఏషోంతరాదిత్యే హిరణ్మయః పురుషో దృశ్యతే, హిరణ్యశ్మశ్రుః, హిరణ్యకేశః, –– ఆప్రణఖాత్ సర్వ ఏవ సువర్ణః”(సూర్య మండలం మధ్యలో వేంచేసి ఉన్న ఏ ఈ బంగారు వన్నెను కలిగిన పురుషుడు గోచరిస్తున్నాడో, అతడు, బంగారు వన్నెలోని మీసాలను కలవాడు, బంగారు వన్నెలోని కేశాలను కలవాడు. –– గోళ్ళ నుండి శిరస్సుపర్యంతంగా అంతా కూడా బంగారు వన్నెను కలవాడు) అని అంటూ, ఆ పరమ పురుషుడు బంగారు వర్ణాన్ని కలిగినవాడని తెలియజేసింది. ఇక్కడ, ఈ శ్రుతి వాక్యంలో చెప్పబడిన హిరణ్య, సువర్ణ శబ్దాల తాత్పర్యాన్ని తెలియజేసే ఉపనిషద్భాష్యకారులు, వారిని అనుసరిస్తూ మన పూర్వాచార్యులు, ఈ శబ్దాలకు సాక్షాత్తు బంగారువర్ణం అని మాత్రమే కాక, బంగారు వలె ఆకర్షణీయమైన, తేజోమయమైన, చూచేవారి చూపును మనస్సును ఆకర్షించగలిగిన, నెమలిపింఛం రంగువంటి వర్ణమని కూడా చెప్పవచ్చునని వివరించారు.

ఈ అంశాన్ని కొంచెం విజ్ఞాపన చేస్తాను. తిరువాయ్ మొళి ప్రబంధంలోని (3–1–2) వ పాశురంలో శఠకోపసూరి భగవానుని తిరుమేని వర్ణాన్ని కీర్తిస్తూ "**శుట్టురైత్త నన్ పొన్ ఉన్ తిరుమేని ఒళి ఒవ్వాదు**" (భగవన్! బాగా కాచి వడబోసిన మంచి మేలిమి బంగారం కాంతి కూడా నీ తిరుమేని వర్ణంతో సాటి రాదు) అని అన్నారు.

ఇది ఒక అత్యద్భుతమైన అలంకారిక ప్రయోగం ఈ సూక్తిలో "**ఉపమేయం అయిన భగవంతుని తిరుమేని వర్ణంతో ఉపమానమైన, బాగా కాచి వడబోసిన మేలిమి బంగారం కాంతి కూడా పోలదు**" అని అంటూ, భగవంతుని తిరుమేని వర్ణాన్ని –ఉపమాన కంటే ఉపమేయానికి ఆధిక్యాన్ని వర్ణించడం అనే వ్యతిరేకాలంకార క్రమంలో ఆళ్వారులు కీర్తిస్తున్నారు. అందువల్ల ఇక్కడ ఉపమేయం భగవంతుని తిరుమేని వర్ణం కాగా, ఉపమానం కాచిగూడ బోసిన మేలిమి బంగారు వర్ణం. ఈ సూక్తిలో జాగ్రత్తగా గమనించి చూస్తే, ఉపమేయం నిర్విశేషణంగా చెప్పబడగా, దానికి ఉపమానంగా చెప్పబడే బంగారు వర్ణం, "**బాగా కాచి వడబోసిన బంగారు వర్ణం**" అని విశేషణ యుక్తంగా చెప్పబడింది.

అయితే, ఇక్కడ ప్రశ్న ఏమంటే, ప్రాథమికంగా, భగవంతుని తిరుమేని వర్ణానికి బంగారు రంగు ఉపమానంగా ఎక్కడైనా చెప్పబడితే, లేక, చెప్పే అవకాశం ఉంటే కదా, ఈ విధంగా కాచి వడ పోసిన బంగారు వన్నె కూడా భగవంతుని తిరుమేని వన్నెకు సాటి రాదు– అని ఇంతగా ఉపమానాన్ని శిక్షించి అది చాలదు – అని నిషేధిస్తూ, ఉపమానాన్ని శిక్షిస్తూ పలికే అవకాశం, ఆవశ్యకత ఉన్నది? ఆ విధంగా ఎక్కడైనా, వేదంలో కానీ, ఉపబృంహణాలలో కానీ, భగవంతుని తిరుమేని వర్ణం బంగారు వర్ణంతో సాటి వస్తుంది అని చెప్పబడిందా? శాస్త్రంలో "ప్రసక్తస్య హి ప్రతిషేధః" (దేనికైనా ప్రసక్తి ఉన్నప్పుడే, దానిని నిషేధించడం అనేది ఆవశ్యకమవుతుంది) అనే

న్యాయం ఉన్నది కదా! అని శాస్త్రీయమైన రీతిలో మీమాంసను చేసిన వ్యాఖ్యాత నంబిళ్ళై, భగవంతుని తిరుమేని వర్ణానికి బంగారు వర్ణం ఉపమానంగా చెప్పబడింది అనేదానికి ప్రమాణంగా మనుధర్మశాస్త్రనుండి "**రుక్మాభం స్వప్నధీగమ్యమ్**" (12–122) అనే వాక్యాన్ని ఉదాహరించారు.

ఈ సూక్తిని వివరించే అరుంబదవివరణం మళ్లీ ఇక్కడ ఒక సందేహాన్ని ఈ విధంగా లేవనెత్తింది.

"**అతసీపుష్పసంకాశః పీతవాసా జనార్ధనః, వ్యభ్రాజత సభామధ్యే హేమ్నీవోపచితో మణిః**" (అగేస్య పువ్వుల వర్ణంవంటి వర్ణాన్ని కలిగినవాడు, పీతాంబరాన్ని ధరించినవాడు అయిన ఆ శ్రీకృష్ణుడు– బంగారంలో పొదిగిన నీలమణి వలె, ఆ సభ మధ్యలో ప్రకాశించాడు) అనే భారతం సభా పర్వంలో ఉండే ఒక సూక్తిని ఉదాహరించి, ఈ విధంగా కాలమేఘంవలె నల్లని వర్ణాన్ని కలిగినవాడైన భగవంతుడు బంగారు రంగును కలిగి ఉండడం ఏ విధంగా సంభవిస్తుంది? అనే సందేహాన్ని ప్రస్తావించి, ఇక్కడ, మను ధర్మశాస్త్రంలో చెప్పబడిన "**రుక్మాభమ్**" అనే ప్రయోగాన్ని.

"**చంద్రవన్ముఖమ్**" – ముఖము చంద్రుని వంటిది– అనే క్రమంలో చెప్పినట్లుగా గ్రహించాలని తెలియజేసింది. అంటే, "**ముఖము చంద్రుని వంటిది**" అనే ప్రయోగం "**ముఖం చంద్రుని వలె ఆకర్షణీయమైనది**" అనే అర్థంలో గ్రహింపబడినట్లుగానే, ఇక్కడ కూడా, "**రుక్మాభమ్**" (బంగారుతో పోలినవాడు) అనే ప్రయోగానికి – బంగారం వలె ఆకర్షణీయమైన, దర్శనీయమైన వర్ణాన్ని కలిగినవాడు – అని కాని, నల్లని వర్ణాన్ని కలిగినదై, ఎఱ్ఱని వర్ణం మిక్కిలిగా ఉన్నదానివల్ల, "**మయూర గ్రీవాసదృశమ్**" (నెమలి కంఠం రంగుతో సమానమైనది) అని చెప్పినట్లుగా, నెమలి కంఠం రంగుతో సమానమైన వర్ణాన్ని కలిగినవాడు– అని కానీ, లేక, హిరణ్యా వర్ణ అయిన లక్ష్మితో ఎల్లప్పుడూ కలసి ఉన్నదానివల్ల కానీ, లేక, "**హిరణ్మయః పురుషః**"

అనే అంతరాదిత్య పురుషుని విషయంగా కానీ, తాత్పర్యాన్ని గ్రహించాలి – అని ఇక్కడ జీయర్ అరుంబదవివరణం తెలిపింది.

ఇంతే కాకుండా, ఇక్కడ ఇంకొక విశేషం ఉన్నది. బంగారాన్ని తెలిపే పర్యాయపదాలలో, "**జాంబూనదమ్**" అనే పదం ఒకటి ఉన్నది. ఈ పదాన్ని అమరసుధావ్యాఖ్యానం వివరిస్తూ "**జంబూరసస్య నద్యాం భవమ్**" (నేరేడుపళ్ళ రసాల నదిలో పుట్టినది) అనే వివరణను తెలియజేసింది. దీనిని బట్టి, నేరేడు పండు రంగులో ఉండే సువర్ణ ప్రకారం కూడా ఒకటి ఉన్నదని భావించాలి. ఈ వర్ణం భగవంతుని తిరుమేని వర్ణంతో పోలినదే కదా. ఇంతే కాకుండా, "**ప్రకాశించునది మంచి కాంతిని కలిగినది మంచి వర్ణాన్ని కలిగినది**" అనే అర్థాలను ఇచ్చే, బంగారాన్ని తెలిపే, హిరణ్య సువర్ణ రుక్మాది శబ్దాలు అన్నీ కూడా భగవంతుని వర్ణానికి ఉపమానాలుగా చెప్పడంలో ఏ అడ్డు లేదు కదా. అందువల్ల పైన ఉదాహరించిన అంతరాదిత్య శ్రుతిలోని "**హిరణ్య వర్ణః**" అనే ప్రయోగానికి "**బంగారంవలె ఆకర్షణీయమైన వర్ణాన్ని కలిగినవాడు**"– అనే అర్థాన్ని గ్రహించడంలో కూడా ఏ విధమైన విప్రతిపత్తి ఉండదు కదా.

ఈ విధంగా అంతరాదిత్య శ్రుతి భగవంతుని తిరుమేని శోభను "**హిరణ్య వర్ణః**" అనే ప్రయోగం ద్వారా తెలిపి, వెంటనే, ఆ స్వామి, దానిని దర్శించిన భక్తుల చూపులను, మనస్సులను కొల్లగొట్టే దివ్యాయవ విశేషాన్ని "**తస్య కప్యాసం పుండరీకమేవమక్షిణీ**"– ఆ విధంగా బంగారం వలే ఆకర్షణీయమైన తిరుమేని వర్ణాన్ని కలిగిన భగవంతునకు నిండయిన నీటిలో పుట్టి, బాగా బలమైన నాళాన్ని కలిగిన, ఉదయించే సూర్యుని కిరణాలచే వికసించిన తామర పువ్వు రేకుల వలె, నిర్మలమైన, విశాలమైన, ఆకర్షణీయమైన నేత్రాలున్నాయి– అని తెలిసింది.

భగవంతుని దివ్య మంగళ విగ్రహంలో ఎన్నో దివ్యావయవాలు ఉండగా, వేదపురుషుడు, భగవంతుని ఇరుమేని స్మరించిన వెంటనే, ఆ స్వామి

తిరుమేనిలోని పుండరీకనయనాలనే ప్రస్తావించడానికి ఏమి కారణం? అనే సంగతి ఇక్కడ గమనించవలసి ఉన్నది. **"యథాభూతవాది హి శాస్త్రమ్"** అని అంటారు భగవద్రామానుజులు. ఉన్న విషయాన్ని ఉన్నట్లుగా శాస్త్రం తెలుపుతుంది. శాస్త్రం అంటే వేదమే. అందువల్ల భగవంతుని దివ్యాంగాలు అన్నిటిలోనూ ఆ స్వామి తిరునేత్రాలు ప్రధానమైనవి కనుక, వాటిని వేదం ముందుగా ప్రస్తావించినది. **"సర్వస్య గాత్రస్య శిరః ప్రధానం, సర్వేంద్రియాణాంమ్ నయనం ప్రధానమ్"** (శరీరంలో అన్ని భాగాలలోను శిరస్సు ప్రధాన అందులో కూడా నేత్రం ప్రధానం) కదా.

అంతేకాక, ఇంకొక విషయం కూడా ఇక్కడ ఉన్నది. ఇక్కడ వేదపురుషుడు తన అనుభవాన్ని ప్రస్తావిస్తున్నాడు. అతనికి భగవంతుని దివ్య మంగళ విగ్రహానుభవం మనసులో స్మరణకు వచ్చిన రీతిలో ఇక్కడ మనకు ఉపదేశిస్తున్నాడు. తమ మనస్సులో ఒకటి మాటలో ఒకటి చెప్పరడు కదా, సత్పురుషుడు. అందువల్ల వాస్తవ వాది అయిన వేద పురుషుడు తన అనుభవాన్ని యథాతథంగా, తన మనసులో స్మరణకు వచ్చిన, రీతిలో ఇక్కడ తెలియజేస్తున్నాడు. ఏ విధంగా?

వేదపురుషునకు భగవంతుని దివ్య మంగళ విగ్రహం మనసులో ఇంతకు ముందు అనుభవించిన రీతిలో ప్రత్యక్షం కాగానే, ఆ దివ్య మంగళ విగ్రహంలో తన వాక్కును, మనస్సును దోచుకున్న దివ్యాంగాలైన నేత్రాలను ముందుగా ప్రస్తావిస్తున్నాడు. వేద పురుషుడు ముందుగా భగవంతుని పుండరీక నయనాలను ప్రస్తావించడంలోని కారణం– అవి అతనిని మనస్సును మొట్టమొదటగా ఆకర్షించడం వల్లనే కదా. **"యన్మనసా ధ్యాయతి తత్వాచా వదతి"** కదా. అందువల్ల ఇక్కడ భగవంతుని దివ్య మంగళ విగ్రహంలో ఉండే పూచిన తామర పూలవంటి తిరునేత్రాలు– ఎటువంటి వారి మనసును అయినా, చూపులు అయినా, వాక్కును అయినా దోచుకోగలిగినవి

– అని తెలుస్తున్నది. ఇది వేదపురుషునకు కలిగిన, భగవంతుని దివ్య మంగళ విగ్రహానుభవ ప్రకారం.

భగవానుడు శ్రీరాముడై అవతరించగా వేదం శ్రీరామాయణరూపంలో అవతరించినది– అని వేదోపబృంహణ సూక్తి. పైన వేద పురుషుడు తెలిపిన అనుభవాన్ని శ్రీరామాయణం కూడా అందంగా వ్యక్తం చేసింది. వేద సూక్తిని సాక్షాత్తు వేద పురుషుడే తెలుపగా, శ్రీరామాయణంలో ఆ అనుభవాన్ని శబ్దస్వరూపుడైన హనుమ తెలియజేడం విశేషం, ఆశ్చర్యకరం కూడా. దానిని ఏ విధంగా హనుమ తెలియజేశాడో కొంచెం గమనిద్దాం.

ఇది సుందరకాండలో జరిగిన సందర్భం. సీతాదేవి, హనుమంతుని చూసి, "**అతడు రాముని దగ్గర నుండి వచ్చిన దూత**" అని తాను నమ్మడానికి అనువుగా శ్రీరాముని లక్షణాలనుగూర్చి తనకు తెలియజేయమని అన్నది. అప్పుడు సమాధానంగా హనుమంతుడు పలికిన మొట్టమొదటి సూక్తిని గమనించండి.

"**రామః కమలపత్రాక్షః సర్వసత్వ మనోహరః**" అనేది హనుమంతుని సమాధానంలో మొట్టమొదటి వాక్యం. దీని భావం ఏమంటే– "**రాముడు తామర పూల రేకుల వంటి నేత్రాలను కలవాడు, సకల ప్రాణుల మనస్సులను ఆకర్షించేవాడు**" అని. ఇది ఈ సూక్తిని పైపైన గమనించినప్పుడు తోచే అర్థం. నిశితంగా గమనించి చూస్తే, పైన ప్రస్తావించిన అంతరాదిత్యవిద్యలోని సూక్తిలో గల భావాన్ని అనుసంధిస్తున్నది –అని తెలుస్తున్నది. ఈ తత్వాన్ని కొంచెం గమనిద్దాం.

ఈ సూక్తిలోని మొదటి పదం "**రామః**" అనేది. ఈ పదం, ఇక్కడ, కేవలం దశరథుని కుమారుడు రాముడు – అనే అర్థాన్ని మాత్రమే తెలుపదు. తరువాత ఉండే "**కమల పత్రాక్షః**" అనే పదసాహచర్యం కారణంగా,

**"రమయతి ఇతి రామః"** (రమింపజేసేవాడు, రూప సౌందర్యంతో ఆనందింపజేసేవాడు కనుక రాముడు) అనే వ్యుత్పత్తి ఇక్కడ రామశబ్దానికి వివక్షితం. ఇది సాముదాయికంగా ఉండే, అందరిని ఆకర్షించే శ్రీరాముని గొప్ప దివ్య మంగళ విగ్రహ సౌందర్యాన్ని తెలుపుతున్నది. అందువల్ల, ఇది పైన ప్రస్తావించిన ఛాందోగ్యశ్రుతిలోని **"హిరణ్య వర్ణః"** అనే పదంలోని అర్థాన్ని అనుసంధిస్తున్నది.

హనుమ సూక్తిలో **"కమల పత్రాక్షః"** అనేది రెండవ పదం. ఈ పదానికి –తామర పువ్వుల రేకుల వంటి కన్నులను కలిగినవాడు– అనేది సామాన్యంగా తోచే అర్థమైనా, దానికి ముందు ఉండే రామపదం చేత వ్యక్తం అవుతున్న, "అంతులేని, అలౌకికమైన దివ్య మంగళ విగ్రహ సౌందర్యాన్ని కలవాడు" అనే అర్థాన్ని అనుసరించి, దానికి తరువాత ఉండే, **"సర్వసత్వ మనోహరః"** (జీవులందరి మనసులను ఆకట్టుకునేవాడు) అనే పదసాహచర్యం వల్ల, "ఆ అంతు లేని సౌందర్యాన్ని కలిగిన దివ్యమంగళ విగ్రహంలో, ఎటువంటి వారి మనసును అయినా ఆకర్షించగలిగిన, తామర పూల రేకులవంటి నేత్రాలను కలవాడు"– అనే విలక్షణమైన అర్థం స్ఫురిస్తుంది. అందువల్ల ఇది పై అంతరాదిత్యశ్రుతిలోని **"అస్య యథా కప్యాసం పుండరీకమేవ మక్షిణీ"** అనే ప్రయోగంలోని భావాన్ని అనుసంధిస్తున్నది. ఈ విధంగా ఈ శ్రీరామాయణ సూక్తి పై ఛాందోగ్య శ్రుతి తాత్పర్యాన్ని ఉపబృంహణం చేస్తున్నది.

ఇప్పుడు, ఈ రెండిటి భావాన్ని అనుసంధించే ఆళ్వార్ల సూక్తిని అనుసంధిద్దాం.

తిరువాయ్ మొళి ప్రబంధంలోని(3–7) వ దశకంలోని, మొదటి పాశురంలో, నమ్మాళ్వారులు భగవంతుని దివ్యమంగళ విగ్రహ శోభను స్తుతిస్తూ, **"పయిలుమ్ శుడరొళి మూర్తియై పంగయ క్కణ్ణనై"** (అంతు లేని

ఎల్లప్పుడూ, వృద్ధి చెందే, లేక, నిత్యమైన, ప్రకాశించే సౌందర్యాన్ని కలిగిన దివ్యమంగళ విగ్రహాన్ని కలవాడు, తామర పువ్వులవంటి నేత్రాలను కలవాడు) అని అన్నారు.

ఈ సూక్తిని నంబిళ్ళై వ్యాఖ్యానిస్తూ, మొదట "**పయిలుమ్ శుడరొళి**" అని దివ్య మంగళ విగ్రహ సౌందర్యాన్ని, ఆ తరువాత మిగిలిన పేరు దివ్యాంగాలను వేటినీ ప్రస్తావించకుండా, వెంటనే, "**పంగయక్కణ్ణనై**" అని తిరునేత్రాల సౌందర్యాన్ని ప్రస్తావించడంలో గల తాత్పర్యాన్ని "**వడివళ్ళుకెల్లామ్ పాదియుమ్, కణ్ణళ్ళుకు పాదియుమాయిరుక్కుమ్**" (రూప సౌందర్యం సగమై, నేత్ర సౌందర్యం సగమై ఉంటుంది) అని వివరించారు.

ఈ వివరణకు సంవాదంగా నంబిళ్ళై శ్రీరామాయణంలోని, సీతాదేవితో హనుమ పలికిన, "**రామః కమల పత్రాక్షః**" ఎన్నుమాపోలే– అని అంటూ పైన వివరించిన సూక్తిని ఉదాహరించారు. ఉదాహరించడమే కాక, "**వడివిలే తువక్కుణ్ణారై వళైత్తుక్కొళ్వదు కణ్ణళ్ళుకాయ్‌ఱ్ఱు. ఒరు శుడర్కడల్ పోలే ఆయిఱ్ఱు వడివు, అదు పరప్పు మాఱ తామరై పూత్తాప్పోలేయాయిఱ్ఱు కణ్ణళ్ళుకు. వడివళ్ళుకుదానే ఆకర్షిక్కవఱ్ఱు, అదుక్కుమేలే అగవాయిల్ వాత్సల్యాది గుణంగళుక్కుమ్ ప్రకాశమా ఇరుక్కుమిఱే కణ్**" (రూపంలో చిక్కుకున్న వారిని, నేత్ర సౌందర్యం అనేది వేరొక ఏ దివ్యా అవయవంలోనూ పోకుండా చేస్తుంది. రూప సౌందర్యం ఒక సముద్రంవంటిది అయినది. దాని విస్తృతిని అంతా వ్యాపించే విధంగా తామరపూలు పూచినట్లుగా అయినది, నేత్ర సౌందర్యం. రూప సౌందర్యమే చాలు భక్తులను ఆకర్షించడానికి, దానికి మించి, మనసు లోపల ఉండే వాత్సల్యం మొదలైన దివ్యాత్మ గుణాలకు ప్రకాశకంగా నేత్రాలు ఉంటాయి కదా) అని వాఖ్యానించారు.

ఇక్కడ మరొక ఆశ్చర్యకరమైన విశేషం ఏమంటే, ఈ వ్యాఖ్యాన సూక్తి ఉదయాన్నే ఆవిష్కరిస్తూ, "మిగిలిన దివ్యాంగాలకంటే, నేత్రసౌందర్యం భక్తులను ఆకర్షించడానికి కారణం ఏమంటే, అది దివ్య మంగళ విగ్రహ గుణమైన సౌందర్యాన్ని, దివ్యాత్మ గుణాలైన కరుణ వాత్సల్యం మొదలైన గుణాలను ప్రకాశింప చేయడమే. ఇటువంటి వైలక్షణ్యం మిగిలిన ఏ దివ్యాంగంలోనూ లేదు కనుక, నేత్ర సౌందర్యం భక్తులను ముందుగా ఆకర్షిస్తుంది" అని తాత్పర్యం– అని అరుంబద వివరణం ఈ సందర్భంలో తెలిపింది.

ఇందువల్ల, నమ్పిళ్ళై అనుగ్రహించిన ఈ వ్యాఖ్యాన సూక్తిలో, పైన ప్రస్తావించిన ఛాందోగ్య శ్రుతివాక్యంలో, శ్రీరామాయణసూక్తిలో, ఆళ్వార్ల పాశురంలో, భగవానుని దివ్య మంగళ విగ్రహ సౌందర్య ప్రస్తావన తరువాత, వెంటనే, తిరునేత్ర సౌందర్య ప్రస్తావనను చేయడాని కల కారణం స్పష్టం చేయబడింది– అనే విశేషం ఈ అరుంబద వివరణలో స్పష్టమవుతున్నది.

ఈ విధంగా శ్రుతివాక్యాన్ని, శ్రీరామాయణ సూక్తి, దానిని ఆళ్వారుల పాశుర సూక్తి, దానిని నంబిళ్ళై వ్యాఖ్యాన సూక్తి, దానిని అరుంబదకారుల వివరణ సూక్తి విశదం చేయడం ఆస్తిక సహృదయుల హృదయాలను దోచుకుంటుంది – అనడంలో ఏ సందేహం లేదు కదా.

ఈ సందర్భంలో మరొక విశేషమైన అంశాన్ని కూడా విన్నవించి ముగిస్తాను. ఇంతకు ముందు తెలిపినట్లుగా, భగవంతుని నేత్ర సౌందర్యం అనేది నేత్రాలలో ఉండే పరభాగ శోభ వల్ల ఏర్పడింది. పరభాగ శోభ అంటే, రెండు విభిన్న వర్ణాల మేళనం వల్ల ఏర్పడే ఒక అపూర్వమైన, మనసును చూపును ఆకట్టుకునే, మిశ్రమవర్ణం వల్ల ఏర్పడే శోభ. ఇక్కడ, స్వామి నేత్రాలు పుండరీక సదృశాలు – అని ఛాందోగ్యం అన్నది. పుండరీక శబ్దానికి **"పుండరీకం సితాంభోజమ్"** అని తెల్ల తామర అని అర్థం. అందువల్ల,

భగవానుడు పుండరీకాక్షుడు అంటే, తెల్ల తామరలవంటి నేత్రాలు కలిగినవాడు– అని అర్థం. అయితే, స్వామి నేత్రాలు పూర్తిగా తెల్లనివి కాదు. ఆ నేత్రాల పర్యంతాలలో ఎఱ్ఱని రేఖలు కూడా ఉంటాయి. **"శెవ్వరియోడు"** అని తిరుప్పావ్ అన్నారు కదా. ఈ విధంగా స్వామి నేత్రాలు తెల్లని, ఎఱ్ఱని వర్ణాలను రెండిటిని కలిగి ఉండడం వల్ల, ఆ నేత్రాలలో అద్వితీయమైన, విలక్షణమైన పరభాగ శోభ ప్రకాశిస్తూ ఉంటుంది. అందువల్ల ఆ నేత్రాల సౌందర్యం అత్యంత విలక్షణంగా ఉంటుంది.

అయితే, ఈ విధంగా స్వామి నేత్రాలలో ఎఱ్ఱని రంగు కూడా ఉండడానికి గల కారణాన్ని అభిజ్ఞులైన మన పూర్వాచార్యులు వివరిస్తూ, స్వామికి భక్తులపై కల అనురాగం, అంటే, వాత్సల్యం వల్ల స్వామి నేత్రాలు కొద్దిపాటి ఎరుపును కలిగి ఉంటాయి అని, ఆ విధంగానే, స్వామి నిరంకుశమైన ఐశ్వర్యాన్ని కలిగినవాడు కనుక, ఆ ఐశ్వర్యాన్ని సూచించే రీతిలో కూడా స్వామి నేత్రాలు కొద్దిపాటి ఎరుపు రంగును కలిగి ఉంటాయి అని వివరించారు. ఇందువల్ల స్వామి నేత్రాలలో ఉండే ఎరుపు రంగు ఆ స్వామికి కల వాత్సల్యం మొదలైన గుణాలను తెలుపడం ద్వారా ఆ స్వామి యొక్క సౌలభ్య గుణాన్ని ప్రకాశింపజేస్తున్నది. ఇంతేకాకుండా, స్వామి నేత్రాలలోని ఎరుపు రంగుకు సర్వేశ్వరత్వం కూడా కారణం కనుక, భగవంతుని పరత్వాన్ని కూడా అది సూచిస్తుంది. ఈ విధంగా స్వామి నేత్ర సౌందర్యం భగవంతుని అసాధారణ లక్షణాలుగా, ఉభయ లింగాలుగా చెప్పబడే పరత్వ, సౌలభ్యాలను రెండిటిని ప్రకాశింప చేస్తున్నందువల్ల, మిగిలిన దివ్యాంగాలకంటే భగవంతుని దివ్య నేత్రాలకు కల ప్రాధాన్యాన్ని దృష్టిలో పెట్టుకొని, శ్రుతి, ఉపబృంహణ, దివ్య సూరి సూక్తులలో, మిగిలిన దివ్యాంగాల ప్రస్తావన చేయబడకుండా, దివ్యనేత్రాల ప్రస్తుతి చేయబడింది. స్వస్తి.

★★★★★

# పరగత స్వీకారం – పరగత తిరస్కారం

★★★★★

వేదాది శాస్త్రాలలో, శ్రీరామాయణాది ఉపబృంహణాలలో మోక్షోపాయాలు అన్నిటిలోనూ న్యాసం అనబడే శరణాగతి " తస్మాన్న్యాస మేషాం తపసా మతిరిక్త మాహుః" ఉత్తమమైన ఉపాయంగా తెలుపబడింది. భగవద్గీతలో కూడా చివరిగా ఈ శరణాగతియే ఉత్తమమైన మోక్షోపాయంగా శ్రీకృష్ణునిచే ఉపదేశింపబడింది. శరణాగతి అంటే, తన రక్షణ భారాన్ని పూర్తిగా భగవంతుని సన్నిధిలో సమర్పిస్తూ ఆ స్వామిని ఉపాయంగా ఆశ్రయించడం. అందువల్ల ఉపాయంలో, ఆశ్రయణం అనేది చేతనకర్తృకం. దీనికి స్వగత స్వీకారం– అని శాస్త్రంలో పేరు. ఇది, శరణాగతి లక్షణంలో చెప్పబడిన 6 అంగాలలో గోప్తృత్వ వరణమనే అంగాన్ని ప్రధానంగా కలిగినది.

ఈ స్వగత స్వీకారం శాస్త్రంలో మర్కట కిశోరన్యాయంతో చెప్పబడుతున్నది. అంటే "తల్లి కోతిని పిల్లకోతి గట్టి పట్టుకోవడంవంటిది" ఈ స్వగత స్వీకారం. ఇది నిరపాయమని చెప్పడానికి లేదు ఎందుకంటే, పిల్ల కోతి తన పట్టును తప్పి కిందకు పడిపోవచ్చు, అది కోరిన రక్షణ లభించకపోవచ్చుకదా. అదేవిధంగా, చేతనుడు చేసే శరణాగతి అనే ఉపాయస్వీకారంకూడా. సాపాయమైనదే. విశ్వాస దుర్బల్యం వల్ల ఫలించకపోవచ్చు.

అంతేకాదు, ఈ స్వగత స్వీకార రూపమైన శరణాగతి సాక్షాత్తు మోక్షోపాయం కాదు, అది భగవంతుడు రక్షించడానికి తగిన యోగ్యతను మాత్రమే కలిగిస్తుంది. చేసిన శరణాగతిని భగవానుడు అంగీకరిస్తే కదా, అది సఫలం అవుతుంది. సాక్షాత్తుగా రక్షించేది భగవంతుని నిర్హేతుకమైన కరుణయే. భగవంతుడు మనలను రక్ష్యవస్తువుగా పరిగ్రహించడం – పరగత స్వీకారమే ప్రధానమైన మోక్షోపాయం – అనే విషయాన్ని కూడా వేదమే, "య

**మేవైష వృణుతే తేన లభ్యః**" (ఈ పరమాత్మ ఎవరిని వరిస్తాడో, అతనికే భగవానుడు లభిస్తాడు) అని తెలిపింది. ఈ పరగత స్వీకారమే, అంటే భగవానుడు మనలను రక్షించదగిన వారినిగా అంగీకరించి స్వీకరించడమే ప్రధానమైన మోక్షోపాయం – అనే వైదికమైన సిద్ధాంతాన్ని దివ్యసూరులుకూడా తమ దివ్య ప్రబంధాలతో "**వెఱిదే అరుళ్ శెయ్ వర్**" (భగవానుడు నిర్హేతుకంగానే అనుగ్రహిస్తాడు) అని మొదలైన సూక్తుల ద్వారా తెలియజేశారు. ఈ పరగత స్వీకారమే ప్రధానోపాయమని శ్రీమల్లోకాచార్య శ్రీమద్వరవరమునులు సిద్ధాంతం.

ఈ పరగత స్వీకారం "**మార్జాల కిశోర న్యాయం**" ద్వారా చెప్పబడుతున్నది. అంటే, తల్లి పిల్లి తన పిల్లలను నోటితో కరచుకొని వెళ్లి వాటిని సురక్షిత స్థానంలో పెట్టి రక్షించడంవంటిది. భగవంతుడు స్వయంగా మనలను రక్ష్యవస్తువుగా స్వీకరించి, రక్షించడం. ఈ ఉపాయంలో ఎటువంటి ప్రమాదం లేదు ఎందుకంటే, తల్లి పిల్లి తన పిల్లలను జాగ్రత్తగా నోటితో కరచి పట్టుకొని గమ్యస్థానానికి చేరుస్తుంది కనుక, ఇది ఎటువంటి అపాయం లేని ఉపాయం. ఆ విధంగానే సర్వజ్ఞుడు, సర్వశక్తి అయిన భగవానుడు మనలను స్వీకరించడం అనేది నిరపాయమైన ఉపాయం అవుతుందికదా.

ఈ విధంగా పరగత స్వీకారం అనేది శరణాగతిలో ప్రధానమైన అంగం అయినట్లే, పరగత తిరస్కారం అనేది కూడా శరణాగతిలో ప్రధానమైన అంగమే. శరణాగతి లక్షణంలో ప్రాతికూల్య వర్జనం అనే అంగంద్వారా ఇది తెలుపబడింది.

**దీనిని శ్రీరామాయణం ఏ విధంగా ఉపబృంహణం చేసిందో చూద్దాం.**

ఈ సందర్భం యుద్ధకాండ 16వ సర్గలో గోచరిస్తుంది. సహజంగా సాధుస్వభావుడైన విభీషణుడు, రావణునితో సీతను రామునకు తిరిగి ఇచ్చివేసి, లంకను, అందరిని నశించకుండా రక్షించమని 15వ సర్గలో

అన్నాడు. విభీషణుడు పలికిన ఆ హితవచనాలను రావణునకు నచ్చలేదు, సరి కదా, అవి అతనికి అంతు లేని ఆగ్రహాన్ని తెప్పించాయి. అతడు విభీషణుని దుర్భాషలు ఆడి, "**త్వాం తు ధిక్! కులపాంసనమ్**" (కులాన్ని పాడు చేసేవాడవు అయిన నిన్ను నేను దేశంనుండి బహిష్కరిస్తున్నాను) అని అన్నాడు. వెంటనే విభీషణుడు "**ఉత్పపాత గదాపాణిః చతుర్భిః రాక్షసైస్సహ**" (చేతిలో గదను ధరించినవాడై, తన సహచరులు నలువురు రాక్షసులతో కలసి ఆకాశంలోకి పైకి ఎగిరాడు) అని చెప్పినట్లుగా, లంకను మరుక్షణం విడచిపెట్టి, శ్రీరాముని శరణు వేడడం కోసం బయలుదేరాడు. ఇక్కడ,

ఈ శ్రీరామాయణ సూక్తిలో గల "**ఉత్పపాత**" అనే క్రియాప్రయోగంలోని అర్థ విశేషాన్ని శ్రీరామాయణ వ్యాఖ్యాతలు శ్రీ గోవిందరాజాచార్యులవారు వివరిస్తూ, "**కాలిన ఇసుక నేలపై కాలు మోపి నిలువ లేని విధంగా, లంకలో కాలు మోపి నిలువ లేనివాడైన వెంటనే విభీషణుడు ఆకాశంలోకి ఎగిరాడు**" అని ఇక్కడ ఈ పదం ద్వారా ధ్వనిస్తున్నదని అన్నారు.

నంబిళ్ళై తిరువాయ్ మొళి ప్రబంధంలోని (3–5–9) పాశురంలోని "**పిత్తర్ ఎన్ఱే పిఱర్ కూఱ**" (ఇతడు పిచ్చివాడు అని ఇతరులు అనేటట్లుగా) అనే ప్రయోగంలో ఉండే అర్థవిశేషాన్ని వివరిస్తూ, పై శ్రీ రామాయణ సూక్తిని ప్రమాణీకరించి, ఇందులోని "**ఉత్పపాత**" అనే పదంలోని అర్థ విశేషాన్ని వేరు విధంగా, అందంగా వివరించారు.

ఇక్కడ ఆళ్వారుల సూక్తిలోని "**పిఱర్**" (ఇతరులు) అనే పదానికి, భగవద్భక్తుల కంటే అన్యులు, భగవద్వైముఖ్యాన్ని కలిగినవారు– అని సందర్భాన్నిబట్టి అర్థం.

ఇంత కాలంగా, రావణుని దుష్కార్యాలను, భగవద్వైముఖ్యాన్ని గమనిస్తూ ఉన్నప్పటికీ, అతనితో తనకు కల శరీర సంబంధం, దేశ సంబంధం మొదలైనవి శ్రీరాముడు తనను అనుగ్రహించడానికి అవరోధం కలుగవచ్చు అని సంశయించి, శ్రీరాముని శరణు వేగడానికి సంశయించిన విభీషణుడు, రావణుడు తనను విడచిపెట్టగానే, తనతో గల సంబంధాన్ని అతడు వదిలిపెట్టగానే, భగవానుడు తనను అనుగ్రహించడానికి తగిన యోగ్యత తనకు అప్పుడు పూర్తిగా సిద్ధించింది అనే భావంతో, వెంటనే ఒక్క క్షణం కూడా ఆగకుండా, ఆకాశంలోకి గదను తీసుకొని తన అనుచరులతో కలసి పైకి ఎగిరాడు – అని ఈ పదం ద్వారా వ్యక్తమవుతున్నదనే ఒక సరసమైన అర్థాన్ని తెలిపారు.

విభీషణుడు, రావణుని చెడ్డ నడతను చూచి, అతనికి శ్రీరాముని విషయంలో ఉండే వైరభావాన్ని గమనించి, అతనిని ఇంతకు ముందే వదిలిపెట్టి ఉండవచ్చును. అయితే, రావణుని తాను తిరస్కరించడం అనే అది స్వగత తిరస్కారం అవుతుంది. అంటే, స్వకర్తృకమైన తిరస్కారం అవుతుంది అది తనను శ్రీరాముడు అనుగ్రహించటానికి తగిన పరిపూర్ణమైన యోగ్యతను కలిగిస్తుంది అని అతడు విశ్వసించలేకపోయాడు. నమ్మి ఉంటే, శఎప్పుడో అతడు వదిలి ఉండి ఉండేవాడు కదా. ఏ క్షణంలో రావణుడు తనతో ఉండే సంబంధాన్ని లేకుండా చేసుకుని, తనను దేశ బహిష్కృతుని చేశాడో, ఆ క్షణం. నుండే అతనికి విభీషణునితో గల సంబంధం లేకుండా పోయింది. అంటే, పరగత తిరస్కారం సిద్ధించింది. ఇదే రాముడు తనను అనుగ్రహించటానికి పూర్ణమైన యోగ్యతను తనకు కలిగిస్తుంది – అని విభీషణుడు భావించాడు కనుక, రావణుడు తనను పెట్టిన వెంటనే శ్రీరాముని శరణు వేడడం కోసం మరుక్షణంలో బయలుదేరాడు.

అందువల్ల, పరగత స్వీకారం ఏ విధంగా భగవదనుగ్రహానికి కారణమవుతున్నదో, పరగత తిరస్కారం కూడా భగవంతుడు అనుగ్రహించడానికి కారణమవుతుంది – అని శ్రీరామాయణం ఇక్కడ సూచించింది– అని తెలుస్తున్నది అని నమ్మాళ్ళ ఆశయం.

ఈ పరగత తిరస్కారం అనే వదంలోని పరశబ్దానికి **"భగవదానుకూల్యం ఉండేవారి కంటే ఇతరులు"**– అనే అర్థాన్ని గ్రహించాలి. ఇంతకు ముందు ప్రస్తావించిన పరగత స్వీకారంలోని పరశబ్దానికి భగవంతుడని అర్థం. అంతకంటే భిన్నమైన అర్థాన్ని ఇక్కడ గ్రహించాలి.

ప్రాతికూల్య వర్జనం అనేది శరణాగతి అంగాలలో ఒకటి – అని పాంచరాత్ర శాస్త్రం చెబుతున్నది. ఇక్కడ ఈ పదానికి భగవంతుని విషయంలో, భగవంతుడు చేసే చేతనరక్షణవిషయంలో ప్రతికూలమైన భావాన్ని విడిచిపెట్టడం, భగవద్ విరోధులతో సంబంధాన్ని విడచిపెట్టడం – అనేది సామాన్యంగా అర్థం. ఇక్కడ దానిని, కొంచెం పరిష్కరించుకొని, ఈ పదానికి భగవంతుని విషయంలో వైముఖ్యాన్ని కలిగినవారు తనను విడచి పెట్టే విధంగా, తాను వారిని విడచిపెట్టడం – అనే మరింతంగా అర్థాన్ని గ్రహించాలి– అని ఇక్కడ అరుంబద వివరణ తెలుపుతున్నది.

శ్రీరామాయణ సూక్తి, నమ్మాళ్వారుల సూక్తి తెలిపిన ఈ అర్థాన్నే కులశేఖరులు కూడా తమ ప్రబంధంలో మూడవ దశకంలో, ముందుగా "పేయరే ఎనక్కు యావరుమ్" (నాకు ఈ లోకంలో అందరూ పిచ్చివారే) అని అంటూ భగవద్భక్తుల కంటే అన్యులను తాము విడచిపెట్టినట్లుగా పలికి, స్వగత తిరస్కారాన్ని తెలిపి, అంత మాత్రం భగవదనుగ్రహాన్ని పొందడానికి చాలదు– అని భావించి, వెంటనే, **"యానుమోర్ పేయనే"** (నేను కూడా లోకల దృష్టిలో పిచ్చివాడనే) అని అంటూ భగవద్భక్తుల కంటే అన్యులైనవారు తనను విడచి పెట్టిన విషయాన్ని తెలియజేసి, భగవానుడు తమను

స్వీకరించటానికి ముఖ్యంగా ఆవశ్యకమైన పరగత తిరస్కారం అనే యోగ్యత కూడా తమకు ఉన్నదని విన్నవించారు.

ఈ విధంగా వేదసూక్తిని పాంచరాత్ర సూక్తి, దానిని శ్రీరామాయణ, ఆళ్వారుల సూక్తులు ఉపబృహణం చేయడం అనే ఐకకంఠ్యం సహృదయ హృదయ మనోహరం కదా.

★★★★★

# శ్రీరాముడు పరమేష్ఠి

★★★★★

పరమ భక్తుడైన భీష్మాచార్యునిచే ప్రవర్తింప జేయబడిన శ్రీవిష్ణు సహస్రనామ స్తోత్రంలో శ్రీరాముని వైభవాన్ని తెలిపే నామాలు కొన్ని అనుసంధింపబడ్డాయి – అని ఆ స్తోత్రానికి భగవద్గుణ దర్పణం అనే అందమైన వ్యాఖ్యానాన్ని అనుగ్రహించిన శ్రీ పరాశర భట్టర్ అభిప్రాయపడి, తదనుగుణంగా ఆ నామాలను వ్యాఖ్యానం చేశారు. ఆ నామాలలో **"పరమేష్ఠీ"** అనే నామం ఒకటి. ఈ నామం ఈ స్తోత్రంలో 420వ నామం.

**"పరమేష్ఠీ"** అనే ఈ పదం అమర కోశంలో చతుర్ముఖ బ్రహ్మకు పర్యాయంగా పఠింపబడింది. అమరకోశానికి వ్యాఖ్యానాన్ని చేసిన సుధావ్యాఖ్యానకారుడు **"పరమేష్ఠీ"** అనే ఈ పదానికి **"పరమే వ్యోమని బ్రహ్మపదే వా తిష్ఠతి"** (పరమాకాశంలో, లేక, పరమపదంలో, స్థిరంగా నిలచి ఉండేవాడు) అనే అర్థాన్ని తెలియజేశాడు. వాస్తవానికి ఈ అర్థం పరమాత్మ విషయంగానే అర్థవంతం అవుతుంది. ఎందుకంటే, పరమాకాశం అని పేరు పరమపదానికే ఉన్నది. భూతాకాశానికి లక్షణయా చెప్పాలి, అంతే. ఇక, బ్రహ్మపదం అనే శబ్దానికి కూడా, చతుర్ముఖ బ్రహ్మ పదవి– అని అర్థం కాకుండా, బ్రహ్మ శబ్దం చేత చెప్పబడే పరమాత్మ నిలిచి ఉండే చోటు – అనే అర్థాన్ని చెప్పుకోవడమే యుక్తం. ఇంతే కాక, శబ్దాలన్నీ కూడా అపర్యసాన వృత్తి ద్వారా పరమాత్మ పర్యంతం బోధిస్తాయి – అనేది వేదాంతుల మతం కూడా. అందువల్ల పరమేష్ఠీ అనే ఈ పదం భగవత్పరంగానే సార్థకం అవుతున్నది.

దీనిని శ్రీరామావతారపరంగా వ్యాఖ్యానం చేసే భట్టర్, దీనికి ముందు ఉన్న నామాన్ని దృష్టిలో పెట్టుకొని, ఈ నామాన్ని వ్యాఖ్యానించారు. ఈ నామానికి ముందు నామం **"కాలః"** అనే నామం. ఈ నామానికి **"ఏవంభూతైః**

**గుణై రాత్మని చరాచర సంకలనాత్**" అని "**శ్రీరాముడు, కళ్యాణ గుణాలతో, తన అవతారం చివరిలో చరాచరాలను అన్నిటిని తనతో పాటు కారణవైకుంఠానికి చేర్చడం అర్థం**"– అని వ్యాఖ్యానించిన భట్టర్, తరువాత ఉండే "**పరమేష్ఠీ**" అనే నామాన్ని అవతార సమాప్తి తరువాత పరమపదంలోకి చేరిన విషయం తెలుపబడుతున్నది – అని వివరించి, దీనికి ప్రమాణంగా శ్రీరామాయణం ఉత్తరకాండలోని

"**వివేశ వైష్ణవం తేజః సశరీరః సహానుగః**" (తన అప్రాకృతశరీరంతో పాటు, తన వెంట వచ్చిన చరాచరాలతో పాటుగా పరమపదాన్ని ప్రవేశించాడు) అనే శ్లోకాన్ని,

**భారతంలో సభాపర్వంలో తెలుపబడిన శ్రీరామాయణవృత్తాంతంలోని**

"**ఏవమేష మహాబాహు రిక్ష్వాకు కులవర్ధనః, రావణం సగణం హత్వా దివమాక్రమత ప్రభుః**" (ఈ విధంగా గొప్ప బాహువులను కలవాడు, ఇక్ష్వాకుకులాన్ని వృద్ధి చేసినవాడు, ప్రభువు అయిన శ్రీరాముడు రావణుని పరివారంతో పాటుగా వధించి, పరమపదాన్ని చేరాడు) అనే శ్లోకాన్ని ప్రమాణంగా ప్రస్తావించారు.

ఈ విధంగా భట్టర్ అభిప్రాయంలో– ఈ నామం, శ్రీరామావతారాన్ని ఎత్తిన భగవానుడు ఆ అవతారంలోని కృత్యాన్ని పూర్తిచేసి, పరమపదాన్ని తిరిగి చేరిన విషయాన్ని తెలియజేస్తున్నది.

శ్రీ వేదాంతదేశికులు అనే వేరొక ఆచార్యులు "**పరమేష్ఠీ**" అనే ఈ నామం శ్రీరామాయణంలోని వేరొక సందర్భాన్ని తెలియజేస్తున్నదని అభిప్రాయపడ్డారు. శ్రీరామాయణ గాథను రఘువీర గద్యం అనే శ్రవణపేయమైన, హృదయంగమమైన గద్యరూపమైన స్తోత్రంగా దేశికులు, మలచారు. ఆ స్తుతిలోని 19వ చూర్ణికలో "**శతకోటి శత గుణ కఠిన పరశుధర**

**మునివరకరధృత నిజధనురాకర్షణ ప్రకాశిత పారమేష్ఠ్య!"** అనే ఒక సంబోధనను చేశారు. దీనికి **"వజ్రాయుధం కంటే వంద రెట్లు కఠినమైనది అయిన గంద్రగొడ్డలిని ధరించిన ముని వరుడు అయినా పరశురాముడు చేతిలో ధరించిన వైష్ణవ ధనస్సును ఆకర్షించడం ద్వారా ప్రకాశింప చేసిన పరమేష్ఠిస్వరూపాన్ని కలిగినవాడా!"** అని భావం.

ఈ వృత్తాంతం శ్రీరామాయణం బాలకాండ చివరిలో ప్రస్తుతమైనది. శ్రీరాముడు శివధనుర్భంగాన్ని చేసి, సీతను వివాహమాడి, సీతాదేవితో కలసి, తల్లులు, దశరథుడు, సపత్నీకులైన సోదరులు, పరివారం అంతా వెంట రాగా, అయోధ్యా నగరానికి బయలుదేరాడు. శ్రీరాముడు శివుని ధనుస్సును భంగం చేసిన వృత్తాంతాన్ని శివభక్తుడైన పరశురాముడు విని, శ్రీరాముని పై కోపంతో అతనిని దారిలో ఎదిరించాడు. అప్పుడు శ్రీరాముడు పరశురాముని చేతిలో ఉండే వైష్ణవ ధనుస్సును తాను, గ్రహించి, ఆ మునిని నిర్వీర్యుని చేసి, తన పారమేష్ఠ్యభావాన్ని నిరూపించాడు – అని ఇక్కడ దేశికులు అంటున్నారు.

ఈ విధంగా శివుని చాపాన్ని విరిచి, సీతను వివాహం చేసుకొన్న మహిమ చేత, ఇంద్రుని వజ్రాయుధం కంటే నూరు రెట్లు కఠినమైన, ఆ ముని చేతిలో ఉండే వైష్ణవ ధనుస్సును, అంటే, తన శక్తికి ప్రతిరూపమైన ధనుస్సును అవలీలగా గ్రహించడం చేత, ఈ సందర్భంలో శ్రీరాముడే పరమేష్ఠి అనే విషయం వ్యక్తమైనది – అని దేశికుల అభిప్రాయం.

ఈ సందర్భం శ్రీరాముని పరమాత్మ స్వభావాన్ని నిరూపిస్తున్నదనే విషయాన్ని వాల్మీకి మహర్షి పరశురాముని ద్వారా

**"అక్షయం మధుహంతారం జానామి త్వాం సురేశ్వరమ్,**
**ధనుషోఽ స్య పరామర్శాత్ స్వస్తి తేస్తు పరంతప!"**

(శత్రువులను తపింపచేసే శ్రీరామా! నీవు, ఈ వైష్ణవ ధనస్సును నా నుండి గ్రహించడం వల్ల, నీవే మధువును వధించిన వాడవు, నిర్వికారుడవు నిత్యసూరులకు ప్రభువు –అని తెలుసుకుంటున్నాను) అని వ్యక్తం చేశాడు.

శ్రీరామాయణ వ్యాఖ్యాత శ్రీ గోవిందరాజాచార్యులవారు కూడా ఈ సూక్తిద్వారా మహోపనిషత్ ఉపబృంహణం చేయబడింది – అని అన్నారు. ఇందువల్ల, ఈ సందర్భం శ్రీరాముడే పరమేష్ఠి అనే విషయాన్ని నిరూపిస్తున్నది అని భావించిన దేశికులు, దీనిని ఈ నామానికి నిరూపకంగా పలికారు.

మహానుభావులైన ఈ ఇద్దరు ఆచార్యుల సమన్వయాలు మధురమైనవి కదా.

★★★★★

# శ్రీరామానుజులకు సువర్ణంపై కల ఆశ

పెరియాళ్వార్ తిరువమొళ్ఱి - (4-4-1-) మణవాళమహాముని వ్యాఖ్యానమ్

(నా వకారియమ్) ఆళ్వార్ తిరువరఙ్గప్పెరుమాళ్ అరైయర్ చరమకాలత్తిలే ఉడైయవర్ ఎఴున్దరుళి, **"ఇప్పోదు తిరువుళ్ళత్తిల్ అనుసంధానమేదు?"** ఎన్రు కేట్క, **"భగవన్నామఙ్గళాయిరుప్పన అనేకమ్ తిరునామఙ్గళుణ్డాయిరుక్క, తిరువరఙ్గమ్— ఎన్గిఱ నాలైన్దు తిరువక్షరమ్ కోప్పుణ్ణిరున్దపడియే! ఎన్రు నినైత్తిరున్దేన్ కాణుమ్"** - ఎన్రు అరుళిచ్చెయ్య, అత్తై ఆళ్వార్ తిరువరఙ్గప్పెరుమాళ్ అరైయర్ విరుమ్బిన నామమెన్రు ఉడైయవర్ విరుమ్బియిరుప్పర్".

తిరుక్కోట్టియూరు అనే దివ్యదేశంలో నివసించే శ్రీవైష్ణవులను గొప్పతనాన్నిగూర్చి పెరియాళ్వార్లు నా ప్రబంధంలో (4 −4− 1) **"నావ కారియమ్ శొల్లాదవర్"** (జిహ్వాతో తగని మాటను పలుకనివారు) అని అన్నారు. **"నాలుకతో చెప్పదగని మాటలను చెప్పనివారు"** అనేది దీని తాత్పర్యం. ఈ ప్రయోగంలో **"ఆచార్యులు ఆదరించిన తిరునామాన్ని పల్కడమే జిహ్వాకు కార్యం-"** అనే అర్థాన్ని భావించిన వ్యాఖ్యాత శ్రీవరవరమునులు, దానికి ప్రమాణంగా శ్రీరామానుజులకు సంబంధించిన ఒక మధురమైన ఐతిహ్యాన్ని ప్రస్తావిస్తున్నారు.

ఆళ్వార్ తిరువరఙ్గప్పెరుమాళ్ అరైయర్ అనే ఆచార్యులు శ్రీరామానుజుల అయిదుగురు ఆచార్యులలో ఒకరు. వారి వద్దనే శ్రీరామానుజులు దివ్యప్రబంధాల మూలాన్ని నేర్చారు. వారు పరమపదించే దశలో ఉన్నపుడు వారివద్దకు వెళ్ళిన శ్రీరామానుజులు - **"ఇపుడు మీ మనస్సులో ఉండే అభిప్రాయం దేనిని గూర్చి?"** అని అడిగారు. అపుడు

అరైయర్, "భగవంతునకు ఎన్నో తిరునామాలున్నా. "**తిరువరఙ్గమ్**" అని నాలుగు అయిదు అక్షరాలతో కూడిన నామంలోని అందం ఎంత గొప్పది! అని తలుస్తూ ఉన్నాను" అని అన్నారు.

భగవంతునకు గల అన్ని తిరునామాల కంటే, అతడు ఆదరంతో వేంచేసి ఉండే, దివ్యదేశాలలో చాలా ముఖ్యమైన శ్రీరంగమే అరైయర్ ఆదరానికి లక్ష్యమైనది. దీనిని గ్రహించిన ఆనాటినుండి తిరువరఙ్గమనే దివ్యదేశతిరునామాన్ని, అరైయర్ చాలా ఆదరించిన తిరునామమనే కారణంచేత, శ్రీరామానుజులు కూడా ఆదరించారు. ఇది వారి చరమపర్వనిష్ఠాతిశయాన్ని తెల్పుతుంది.

ఆచార్యరుచిపరిగృహీతమైన విషయం ఏదైనా అది శిష్యునకు ఆదరణీయమైనది అనే సాంప్రదాయికమైన అంశాన్ని కూడా సూచిస్తున్నది.

వ్యాఖ్యాత శ్రీవరవరమునులు ఇక్కడ ఈ "**నావకారియమ్ శొల్లాదవర్**" (నాలుకతో అకార్యం చెప్పనివారు) అనే ఆళ్వారుల సూక్తిని వివరిస్తూ, ఈ ఐతిహ్యాన్ని ఉదాహరించడంలో ఒక సామంజస్యం, స్వారస్యం ఉన్నది. నాలుకతో చేయకూడని పని ఏమై ఉంటుంది? అని ఆలోచిస్తే "పలుకకూడని మాటలను పలుకడమే కదా!, నోటితో చేయకూడని పని. పలుక కూడని మాటలు ఏమయి ఉంటాయి?" అనే ప్రశ్నకు సమాధానంగా, వ్యాఖ్యాత, ఈ ఐతిహ్యాన్ని ఉదాహరించారు– అని తెలియాలి.

ఆచార్యులు ఆదరించని స్తోత్రాలు, శబ్దాలు ఏమైనా, అవి భగవంతునకు చెందినవి అయినా, అవి సదాచార్యాభిమానాన్ని నోచుకోకపోతే, అవి మనకు ఎంత మాత్రం ఆదరణీయాలు కావు. ఆచార్యులు ఆదరంగా పరిగణించినవి అన్ని సువర్ణాలే, అంటే, మంచి వర్ణాలను కలిగినవే, బంగారంవలె స్పృహణీయమైనవే– అనే విశేషం ఈ ఐతిహ్యంతో స్పష్టమవుతున్నది. ఇందువల్లనే, లోకంలో ఎంతో మంది

రచించిన, ఎన్నో విధాలైన భగవంతుని కీర్తించే స్తోత్రాలు, ప్రబంధాలు ఉన్నప్పటికీ, మన పూర్వాచార్యులు ఆదరించిన ప్రబంధాలే, గ్రంథాలే, స్తోత్రాలే మనకు ఆదరణీయాలు కావడం. ఈ సాంప్రదాయికమైన విశేషాన్ని మనకు తెలియజేయడం కోసంకూడా శ్రీవరవరమునులు దీనిని ఇక్కడ ఉదాహరించారు– అని భావించాలి.

శ్రీరామానుజులకు శ్రీరంగంపట్ల గల ఆదరాతిశయాన్నిగూర్చి వారి ప్రశిష్యులు తిరువరఙ్గత్తముదనార్ ఇరామానుశ నూற்றన్దాది ప్రబంధంలో **"పొన్నరఙ్గ మెన్నిల్ మయలే పెరుకుమ్ ఇరామానుశన్"** (36) (బంగారువలె ఆశపడదగిన అందమైన శ్రీరంగం, అంటే, దానిలో వ్యామోహాన్ని పొందే శ్రీరామానుజులు) అని పల్కడం గమనించవచ్చు. శ్రీరంగవిమానం స్వర్ణమయం కదా! అందుచేత ఇక్కడ **"పొన్ అరఙ్గమ్"** అనే ప్రయోగం సార్థకం, సాభిప్రాయకం. ఇక్కడ "పొన్" అనే పదానికి, ప్రకృతంలో ఉట్టంకింపబడిన ఐతిహ్యాన్ని దృష్టిలో పెట్టుకొని చూస్తే, సామాన్యంగా, వాచ్యంగా ఉండే "చాలా విలువైన, అందరినీ ఆకర్షించే రూపాన్ని కలిగిన లోహమైన బంగారం" అనే అర్థాన్ని కాకుండా, తమకు ఆచార్యులు అయిన అరైయర్ ఎంతో ప్రీతితో ఆదరించిన భగవంతుని తిరునామం రంగశబ్దం కనుక, ఆ నామాన్ని శ్రీరామానుజులు, బంగారం వలె భావించి ఆదరించారు. బంగారం సువర్ణం అయినట్లే, ఈ రంగ శబ్దం కూడా భగభద్రామానుజులకు సువర్ణమైనది, అంటే ఆకర్షించే అక్షరాలను కలిగినది అయినది. బంగారం ఏ విధంగా లోకంలో ఉండేవారి మనసును దృష్టిని ఆకర్షించి, ఆనందాన్ని కలిగిస్తుందో. ఆ విధంగానే, తమ ఆచార్యులు ఆదరించిన శ్రీరంగం అనే పదం కూడా శ్రీరామానుజుల మనసును, చెవులను ఆకర్షించి, వారికి ఆనందాన్ని కలిగించింది. దానికి కారణం, అది తమ ఆచార్యుల అభిమానానికి పాత్ర కావడమే – అనేది ఇక్కడ ఐతిహ్యం ద్వారా తెలియజేయబడింది.

ఈ ప్రయోగాన్ని వరవరమునులు వ్యాఖ్యానిస్తూ "**స్పృహణీయమైన శ్రీరంగం**" అని అనడంలోని తాత్పర్యం ఇదేకదా. ఇక్కడ శ్రీపిళ్లైలోకమ్ జీయర్ అనే వేరొక వ్యాఖ్యాత కూడా "**వానుమ్ మణ్ణుమ్ నిఱైందు ఈండి, వణంగుమ్ నల్ తేనుమ్ పాలుమ్ కలందన్నవర్ శేర్ తెన్నరంగమే– ఎన్గిఱపడియే, తద్విషయకమాన భక్తి తదీయపర్యంతమాయ్, తిరువరంగ మెన్ఱు యాదృచ్ఛికమాక చ్చొన్నాలుమ్ తద్భక్తిపారవశ్యత్తాలే కాదల్ మైయలేఱి మేన్మేలన పెరుగి వారానిఱ్కుమ్**" (ఆకాశం, భూమి, అంతా కూడా నిండి, గుంపులుగా చేరి, భగవానుని నమస్కరించేవారు, చక్కని తేనె, పాలు కలిసినట్లుగా, పరమ భోగ్యులైనవారైన పరమ భాగవతులు అభిమానించి చేరిన అందమైన శ్రీరంగం) – అని తిరుమంగై ఆళ్వారులు పలికినట్లుగా, శ్రీరంగనాథుని విషయంలో ఉండే భక్తి అనేది భాగవతపర్యంతంగా వృద్ధి చెంది, "**తిరువరంగం**" అని యాదృచ్ఛికంగా ఎవరు చెప్పినప్పటికీ, ఆ శబ్దశ్రవణంవల్ల ఆ భగవద్భక్తుల విషయంలో ఉండే భక్తిపారవశ్యంచేత శ్రీరామానుజులకు ఉండే వ్యామోహం మరింత మరింత పెరిగుతుంది) అని వ్యాఖ్యానించడం కూడా ఇక్కడ గమనించాలి. ఇందువల్ల, శ్రీరామానుజులకు "**తిరువరంగం**" అంటే, "**భగవంతునకు సంబంధించిన నామం, ఇది**" అనే ఆదరం సామాన్యంగా ఉన్నప్పటికీ, ఆ సామాన్యమైన ఆదరం, "**ఈ నామం మా ఆచార్యులు ఆదరించినది**" – అనే కారణంచేత మరింత మరింత వృద్ధి చెంది, ఆ నామం అమృతప్రాయం కావడానికి కారణమైనది – అని ఏర్పడుతున్నది. శ్రీరామాజులు చూపిన ఈ మార్గాన్ని మనంకూడ అనుసరించాలి– అనే ప్రబోధాన్ని చేయుడంకోసం కూడా శ్రీవరవరమునులు దీనిని ఉదాహరించారు– అని కూడా తెలియాలి.

"**అలూక్షా ధర్మకామాః స్యుః, యథా తే తేషు వర్తేరన్ తథా తేషు వర్తేథాః**" (ఎటువంటి రూక్షమైన స్వభావాన్ని లేనివారు, ధర్మంలో శ్రద్ధను

కలిగినవారు అయిన పెద్దలు ఏషయే సందర్భాలలో ఏషయే విధంగా ఆచరిస్తారో, ఆ సందర్భాలలో, ఆ విధంగానే, ఆచరించాలి) అని ఉపనిషత్తు, **"యద్యదాచరతి శ్రేష్ఠః తత్తదేవేతరోజనః, స యత్ప్రమాణం కురుతే లోకః తదనువర్తతే"** (ఏ ఏ కర్మలను మహానుభావుడు ఎంత పరిమాణంలో ఆచరిస్తాడో, దానినే ఇతరుడు కూడా అంత పరిమాణంలోనూ ఆచరిస్తాడు) అని శ్రీకృష్ణ భగవానుడు, **"మేలైయార్ శెయ్వనకళ్ వేండువన"** (మహనీయులు చేసేవాటిలో ఆవశ్యకమైనవి ఏవో, అవి) అని వేదాలకు అన్నిటికీ బీజం వంటిది అని చెప్పదగిన గోదాదేవి అనుగ్రహించిన తిరుప్పావై ప్రబంధం – ఈ విషయాన్ని తెలిపాయి కదా.

ఈ సందర్భంగా, శ్రీరామానుజుల విషయంగా ప్రపన్నులు నిత్యం అనుసంధానం చేసికొనే తనియన్ శ్లోకాన్ని అనుగ్రహించిన, వారి మనసును తెలిసిన, వారి అంతరంగ శిష్యులలో ప్రధానులైన కూరేశులు, ఆ శ్లోకంలో, **"అచ్యుతపదాంబుజ యుగ్మరుక్మవ్యామోహతః తదితరాణి తృణాయ మేనే"** (అచ్యుత నామంచేత చెప్పబడే శ్రీరంగనాథుని పాదపద్మాలు రెండు – అనే బంగారంలో ఉండే వ్యామోహంచేత మిగిలినవాటిని అన్నిటినీ శ్రీరామానుజులు తృణంతో సమానంగా భావించారు) –అని చమత్కారంగా పలుకడం గమనించదగినది. ఈ విధంగా శ్రీరామానుజులు శ్రీరంగనాథుని నామం అనే వర్ణంలోనూ, ఆ స్వామి పాదపద్మాలనే సువర్ణంలోను అంతు లేని వ్యామోహాన్ని పొందడానికి కారణం–, అవి, తమ ఆచార్యుల రుచికి పాత్రం కావడమేకదా.

★★★★★

# శిఱప్పుడైయ మఱైయవర్

(అతిశయాన్ని కలిగిన వైదికులు)

★★★★

(పెరియాళ్వార్ తిరుమొళి–(4–8–3) తిరువాయ్ మొళిప్పిళ్ళై వ్యాఖ్యానమ్)

★★★★

ఎంత పండితులయినా, ఎంతగా వేదాదిశాస్త్రాల జ్ఞానంలో తల పండినవారైనా, ఆ జ్ఞానాన్ని కలిగిన శిష్యులకు ప్రదానం చేసి, ఆ విధంగాతాము ప్రధానం చేసిన జ్ఞానం వారిలో విశేషంగా ప్రకాశించినప్పుడే ఆ ఆచార్యుడు సార్థక్యాన్ని పొందినవాడు అవుతాడు. ఈ విషయాన్ని పరమ వైదికులైన పెరియాళ్వార్లు ఒక అద్భుతమైన సూక్తితో తెలియజేశారు.

**"ఉడైయవర్ – తిరుక్కురుకైప్పిరాన్ పిళ్ళానైయుమ్, అరుళాళ ప్పెరుమాళ్ ఎమ్బెరుమానారైయుమ్ తిరువుళ్ళమ్ పఱ్ఱిరుక్కుమ్బోలేయుమ్, పెరియనంబి ముదలానార్ ఉడైయవరై తిరువుళ్ళమ్ పఱ్ఱిరుక్కుమ్బోలేయుమ్, నఙ్జీయర్– నమ్బిళ్ళైయై తిరువుళ్ళమ్ పఱ్ఱిరుక్కుమ్బోలేయుమ్, పెరియవడక్కిల్ తిరువీదిప్పిళ్ళై తమ్మకనారాన లోకాచార్యరై త్తిరువుళ్ళమ్ పఱ్ఱిరుక్కుమ్బోలేయుమ్, వళరత్తదనాల్ వయన్ పెఱ్ఱఱ్ఱు చ్చిఱప్పుడైయ మఱైయవర్ వాళ్- ఎన్నుదల్."**

**"శిఱప్పుడైయ మఱైయవర్ వాళ్ తిరువరఙ్గమ్"** (అతిశయాన్ని కల వైదికులు నివసించే తిరువరంగం)అని పెరియాళ్వార్లు తమ ప్రబంధంలో అని శ్రీరంగవైలక్షణ్యాన్ని కీర్తించారు.

## శిఱప్పుడైయ మఱైయవర్

వైదికులకు వైలక్షణ్యం –గొప్ప శిష్యులను పొందగల్గడం. – అనే అర్థంలో దీనికి వ్యాఖ్యాత వివరిస్తూ, ఆ విధంగా గొప్ప శిష్యులను కల్గిన ఆచార్యులను కొందఱిని అక్కడ ఉదాహరించారు.

తిరుక్కురుకైప్పిరాన్ పిళ్ళాన్, అరుళాళప్పెరుమాళ్ ఎమ్బెరుమానార్ మొదలైనవారిని ఉడైయవర్ అభిమానించినట్లుగా, ఉడైయవర్ ను పెరియనంబి మొదలైనవారు అభిమానించినట్లుగా, నమ్పిళ్ళైను నంజీయర్ అభిమానించినట్లుగా, తమ కుమారులైన శ్రీపిళ్ళైలోకాచార్యులవారిని వడక్కుత్తిరు వీదిప్పిళ్ళై అభిమానించినట్లుగా– గొప్ప శిష్యులను పొంది, వారిని జ్ఞానంతో పెంచినందున సఫలమైన వైదికులు నిత్యవాసం చేసే (వారిని జ్ఞానంతో పెంచినందున సఫలమైన వైదికులు నిత్యవాసం చేసే) శ్రీరంగం– అని వ్యాఖ్యాత చేసిన పై వివరణలోని తాత్పర్యం.

ప్రకృతంలో విషయం ఏమంటే, – శ్రీరామానుజులను తమ శిష్యులుగా పొందడం తమ అదృష్టంగా భావించిన గొప్ప ఆచార్యులు పెరియనంబి. ఈ విషయం శ్రీరామానుజచరిత్రలో పలు చోట్ల స్పష్టమవుతుంది. ఇంతే కాదు, భగవద్రామానుజుల ఆచార్యులు అందరూ కూడా, శ్రీ రామానుజులు కతమకు శిష్యులు కావడం తమ అదృష్ట విశేషంగా భావించారు. పెరియ తిరుమలనంబి శ్రీరామానుజులకు సాక్షాత్తు మేనమామ. వారికి శ్రీరామాయణంలోని 18 విధాలయిన రహస్యార్థాలను ఒక సంవత్సర కాలం ఉపదేశించిన ఆచార్యులు కూడా అయ్యారు. అందుచేత, దేహసంబంధాన్ని బట్టి, జ్ఞాన సంబందాన్ని బట్టి పెరియ తిరుమలనుంబి భగవద్రామానుజులకు గౌరవనీయులు, నమస్కరించదగినవారు. అయినప్పటికీ, వారు శ్రీరామానుజులను నమస్కారార్హులుగానే భావించారు. అంతేకాదు దానిని ఆచరించి చూపించారు కూడా.

ఒక పర్యాయం, తమ శిష్యులతో పాటు శ్రీరామానుజులు తిరుమల క్షేత్రానికి వెళ్లినప్పుడు, వారికి స్వాగతం పలకడానికి వెళ్లిన తిరుమల నంబి, శ్రీరామానుజులకు నమస్కరించారట. ఈ ఐతిహ్యం రామానుజ చరిత్రలో కానవస్తుంది.

ఈ విధమైన సందర్భమే పెరియనంబి విషయంలో కూడా జరిగినట్లు శ్రీరామానుజ చరిత్ర చెబుతున్నది. శ్రీరంగంలో తిరువీథులలో రామానుజులవారు తమ శిష్య బృందంతో పాటు వేంచేస్తూ ఉండగా, వారిని చూచిన పెరియనంబి శ్రీరామానుజులకు సాష్టాంగ నమస్కారం చేశారట. **"మీరు మీ శిష్యుని విషయంలో ఎందుకు ఈ విధంగా ప్రవర్తించారు?"** అని వారిని అడిగినప్పుడు, "నేను శ్రీరామానుజులలో మా ఆచార్యులైన శ్రీయామునులను దర్శించాను ఆ విధంగా వారిని భావించి, నమస్కరించాను" అని పెరియ నంబి అన్నారట.

ఇటువంటి సందర్భమే తిరుక్కోట్టి యూర్ నంబిగారి విషయంలో కూడా జరిగినట్లు శ్రీరామానుజ చరిత్ర చెబుతున్నది. శ్రీరామానుజులు తిరుమాలై యాండాన్ అనే ఆచార్యుల వద్ద తిరువాయ్ మొழி దివ్యప్రబంధాన్ని కాలక్షేపం చేస్తున్నప్పుడు, రామానుజులు కొన్ని అపూర్వమైన అన్వయాలను చెప్పగా, ఆండాన్ వాటిని అంగీకరించక, కోపంతో కాలక్షేపాన్ని చెప్పడం నిలిపివేశారు. ఈ సంగతి కొన్నాళ్ళకు తిరుక్కోట్టియూర్ నంబిగారికి తెలిసి, అండం దగ్గరకు వచ్చి **"స్వామీ! మీరు రామానుజులను సామాన్య శిష్యులుగా తలచవద్దు. వారు అవతార విశేషమని గుర్తించండి"** అని చెప్పి, మళ్లీ కాలక్షేపం ప్రారంభం అయ్యేటట్లు చేశారట.

ఈ వృత్తాంతాలు అన్నీ పైన ప్రస్తావించిన **"శిఱప్పుడైయ మఱైయవర్"** అనే పెరియాళ్వార్ల సూక్తికి అనుగుణంగా స్మరించడంలో అడ్డు లేదు.

అంతేకాక, శ్రీరామానుజులు కూడా, కూరేశులను తమకు శిష్యులుగా కలిగి ఉన్నందుకు తమకు సార్థకత లభించినదని భావించేవారట. "**వళర్ త్తదనాల్ పయన్ పెற்றேన్**" (పెంచినందువల్ల ప్రయోజనాన్ని పొందాను) అని మురిసిపోయేవారట. వీరందరూ శ్రీరంగనివాసం చేసినవారే, "**శిఱప్పుడైయ మఱైయవరే**".

గోదాదేవి తమ జ్ఞానపుత్రికగా పెంచి, శ్రీరంగనాథునకు ఇచ్చి వివాహం చేసిన పెరియాళ్వార్లు కూడా "**శిఱప్పుడైయ మఱైయవర్**". కదా. అందుచేత, ఈ సూక్తిని వారు పలకడం చాలా యుక్తం, యుక్తియుక్తంకూడా.

చివరిగా, శ్రీరాముని తనకు శిష్యునిగా పొంది తన జన్మను సార్థకం చేసికొన్న వశిష్ఠమహర్షి, శ్రీకృష్ణుని శిష్యునిగా పొంది, తనను సఫలీకృతుని చేసికొన్న సాందీపుడు కూడా ప్రకృతంలో స్మరణీయం. వారుకూడా "**శిఱప్పుడైయ మఱైయవర్**" అనడంలో ఏ సందేహం లేదు. స్వస్తి.

★★★★★

# శ్రీరామానుజుల

# ద్రావిడప్రబంధసూక్త్యర్థనిర్వాహమాధుర్యం

★★★★★

శ్రీరామానుజులు అనుగ్రహించిన గ్రంథాలు నవరత్నాలుగా చెప్పబడే విధంగా సంఖ్యలో తొమ్మిది. అవి అన్నీ కూడా సంస్కృతంలోనే రచింపబడినందున, ద్రావిడభాషలో వారు రచించిన గ్రంథాలు ఏమీ కనబడనందున, వారికి సంస్కృతభాషలో తప్ప, ద్రావిడభాషలో పాండిత్యం లేదని వాదించేవారు కొందరు ఉంటే ఉండవచ్చు కానీ, అటువంటి వాదాలను చేసేవారికి తగిన సమాధానాన్ని తెలియజేసే విధంగా, శ్రీరామానుజులు ఆ యా ఆళ్వారుల దివ్యప్రబంధాలలోని సూక్తులకు విలక్షణమైన, అనన్య సాధ్యమైన అర్థనిర్వాహాలను చేసిన సందర్భాలు మనకు దివ్యప్రబంధ వ్యాఖ్యానాలలో ఎన్నో చోట్ల కనిపిస్తాయి. అటువంటి సందర్భం ఒకటి శ్రీపెరియాళ్వార్ తిరుమొళి ప్రబంధంలోని చివరి దశకంలో, **"ఎమ్మనా!"** అని ఆరంభం అవుతున్న మూడవ పాశురానికి పెరియ వాచ్చాన్ పిళ్ళై అనుగ్రహించిన వ్యాఖ్యానంలో గోచరిస్తున్నది. దానిని కొంచెం అనుభవిద్దాం.

ఈ దశకంలో పెరియాళ్వార్లు వేంకటాచలంలో ఉండే వేంకటేశ్వరస్వామిని దృష్టిలో పెట్టుకొని పాశురాలను అనుగ్రహిస్తున్నారు. ఈ పాశుర ప్రారంభాన్ని వారు **"ఎమ్మనా! ఎన్ కులదైవమే! ఎన్నుడై నాయకనే!"** అని మూడు సంబోధనలతో చేస్తున్నారు. ఈ మూడు శ్రీవేంకటేశ్వర స్వామిని ఉద్దేశిస్తూ చేసిన సంబోధనలు.

ఈ పాశురంలో పెరియాళ్వార్లు **"ఎమ్మనా! ఎన్ కులదైవమే! ఎన్నుడై నాయకనే! నిన్ ఉళ్ళేనాయ్ పెఱ్ఱ నన్మై ఇ వ్వులకినిల్ యార్ పెఱువార్? నమ్మన్ పోల వీழ்త్తు అముక్కుమ్ నాటుళ్ళ పావమెల్లామ్ శుమ్మైనాదే**

**కైవిట్టోడి తృఱుకళ్ పాయ్ న్దనవే**" (నాకు తల్లివై, నా కులానికి పరదేవతవై, నాకు నాథుడవైన వేంకటేశ్వర స్వామీ! నీ అభిమానంలో ఒదిగి ఉండేవాడనై, నేను పొందిన ప్రయోజనం ఈ సంసారంలో నిత్యులైనవారుకూడా పొందారా? భూతప్రేత పిశాచాల వలె ఈ లోకంలోని ప్రాణులను అందరిని పీడించే పాపాలు అన్నీ నీ మహిమ వల్ల సవాసగా వారిని విడచిపెట్టి పరిగెత్తుకొనిపోయి, సంసారం అనే ముళ్ళ పొదలలో దూరిపోయాయి) అని అంటూ "**శ్రీవేంకటేశ్వర స్వామి అనుగ్రహంవల్ల సమస్త పాపాలు తొలగిపోయాయి**" అని అనడంద్వారా, వేంకటశబ్దార్థాన్ని అనుసంధించారు. ఈ విషయాన్ని ఇక్కడ ముఖ్యంగా గమనించాలి. "**సర్వపాపాని వేం ప్రాహుః కట స్తతద్దాహ ఉచ్యతే**" (వేం అనే పదం సర్వపాపాలను తెలుపుతుంది, కటః అనే పదం వానిని దహించడాన్ని తెలుపుతుంది) అని కదా వేంకట శబ్దనిర్వచనం.

ఈ మూడు సంబోధనలను శ్రీయామునులు అనే ఆచార్యులు ఒక విధంగా, భగవద్రామానుజులు వేరొక విధంగా సమన్వయం చేస్తూ వివరించిన వైనాన్ని వ్యాఖ్యాత పెరియ వాచ్చాన్ పిళ్లై తమ వ్యాఖ్యానంలో ఈ క్రింది విధంగా ప్రస్తావించారు.

"**ఎమ్మనా! ఎన్ కులదైవమే! ఎన్నుడై నాయకనే! – ఎన్గిఱ ఇమ్మూన్గాలుమ్ జ్ఞానవిరోధియుమ్, ఆశ్రయణ విరోధియుమ్, మోక్షవిరోధియుమ్ పోనపడి – ఎన్టు ఆళవన్దార్. దేహాత్మాభిమానముమ్, అనన్యశేషత్వముమ్, స్వస్వాతంత్ర్యముమ్ కழிన్దపడి –– ఎన్ఱు ఉడైయవర్.**"

(ఎమ్మానా! ఎన్ కులదైవమే! ఎన్నుడై నాయకనే! – అనే ఈ మూడు సంబోధనలద్వారా జ్ఞానవిరోధి, ఆశ్రయణవిరోధి, మోక్షవిరోధి తొలగించబడ్డాయి– అని శ్రీయామునులు వివరించారు. దేహాత్మాభిమానం,

అన్యశేషత్వం, స్వస్వాతంత్ర్యం– అనే మూడు లేకుండా చేయబడ్డాయి – అని శ్రీరామానుజులు ఎవరి వివరించారు)

మొట్టమొదటగా, గమనించి చూసినప్పుడు, ఈ ఆచార్యులు ఇద్దరూ చేసిన నిర్వహాలు రెండు కూడా విరోధి నిరసనవిషయంగానే కనిపిస్తాయి. ఈ విధంగా వీరిద్దరూ విరోధి నిరసనాన్నే దృష్టిలో పెట్టుకొని ఈ సంబోధనలను మూడింటిని ఇక్కడ నిర్వహించడానికి కారణమేమి? ఈ అర్థానికి ఏది నియామకం? అని ఆలోచించినప్పుడు, ఈ పాశురంలో ఉండే అర్థమే కారణమని స్పష్టపడుతుంది. ఈ పాశురంలో ఆళ్వార్లు శ్రీవేంకటేశ్వర స్వామి అనుగ్రహం వల్ల తమకే కాక, తమ కులానికి చెందినవారికే కాక, వారి సంబంధ సంబంధులు అందరికీ ఉండే విరోధులు అన్ని తొలగిపోయాయి – అని అంటున్నారుకదా. అందువల్ల, ఈ మూడు సంబోధనలను ఇద్దరు ఆచార్యులు, ఆ అర్థానికి అనుగుణంగా, సమన్వయించి వివరించారు.

అయితే, ఈ ఇద్దరి అర్థనిర్వాహాలలోనూ కనిపించే భేదానికి కారణం ఏమి? ఏ విషయాలను ఆధారంగా చేసుకుని విధమైన, విభిన్నమైన నిర్వాహాలు ఈ ఇద్దరి ఆచార్యులచే చేయబడ్డాయి? అని గమనించి చూస్తే, శ్రీయామునుల అర్థనిర్వాహం అష్టాక్షరి మంత్రలోని మూడు పదాలను దృష్టిలో పెట్టుకొని చేయబడింది –అని, శ్రీరామానుజులు చేసిన అర్థనిర్వాహం ప్రణవంలో ఉండే మూడు అక్షరాలను దృష్టిలో పెట్టుకొని చేయబడింది – అని భావించవచ్చు

ముందుగా, శ్రీయామనుల సమన్వయాన్ని అనుసంధిద్దాం.

“ఎమ్ అనా!” అంటే “నా తల్లీ” అని అర్థం. “ **తల్లి స్తన్యక్షీరాన్ని బిడ్డకు ఇచ్చినట్లే, నాకు జ్ఞానక్షీరాన్ని ఇచ్చినవాడా!**” అని దీని అర్థం. అంటే, – శ్రీమన్నారాయణునకే జీవుడు శేషభూతుడు – అనే జ్ఞానాన్ని స్వామి తన అనుగ్రహంతో కల్గించాడని భావం. అత్మజ్ఞానానికి విరోధి అన్యులకుశేషమై

ఉండడం అనే అన్యశేషత్వం. అందువల్ల **"ఎమ్మనా!"** అనేది అన్యశేషత్వమనే జ్ఞానవిరోధి తొలగించిన విషయాన్ని తెల్పుతున్నది. అందువల్ల, **"ఎమ్మనా!"** అనే ఈ సంబోధన, అష్టాక్షరిలోని మొదటి పదం అయిన ప్రణవంలో ఉండే అర్థాన్ని, అంటే, జీవులు అందరూ భగవంతునకు మాత్రమే శేషభూతులు, ఇంకొకరికి ఎవరికీ కాదు– అనే స్వరూపానికి సంబంధించిన, నిష్కృష్టమైన జ్ఞానాన్ని కలిగించి, ఆ జ్ఞానంలో ఏర్పడడానికి అవకాశం ఉండే అన్యశేషత్వమనే విరోధివి భగవానుడు తొలగించాడు– అనే విషయాన్ని తెలియజేస్తున్నది – అని యామునుల అభిప్రాయం. అందువల్ల ఇది, అష్టాక్షరీ మహామంత్రంలోని మొదటి పదం అయిన ప్రణవంలోని అర్థాన్ని అనుసంధిస్తున్నది ప్రణవంద్వారా జీవుని అనన్యార్హశేషత్వంకదా తెలుపబడుతున్నది.

రెండవ సంబోధన **"ఎన్ కులదైవమే!"** అని. అంటే– **"నా కులానికి పరదేవత అయినవాడా!"** అని భావం. దీనిద్వారా – ఇంకొక దేవతను అభిమానించడమనే భగవదాశ్రయణవిరోధి తొలగిన విషయం తెలుపబడింది. అందువల్ల ఈ సంబోధన ద్వారా, భగవానుడు మాత్రమే ఉపాయం, వేరొకడు కాదు– అనే అర్థాన్ని తెలిపే అష్టాక్షరి మహా మంత్రంలోని మధ్యమ పదమైన నమస్సులోని అర్థం అనుసంబధింపబడింది– అని యామునుల అభిప్రాయం.

ఇక మూడవ సంబోధన **"ఎన్నుడై నాయకనే!"** అని. – (నయతీతి నాయక:– అనే వ్యుత్పత్తినిబట్టి) ఈ సంబోధనకు **"తన శ్రీచరణాల దగ్గరకు నన్ను చేర్చుకొన్నవాడు"** అని అర్థం. దీనిద్వారా మోక్షానికి విరోధి అయిన సంసారబంధం తీరిన విషయం తెలుపబడింది. ఇందువల్ల, ఈ సంబోధన ద్వారా, **"భగవంతునకు ప్రీతిని కలిగించే కైంకర్యం మాత్రమే పరమ పురుషార్థం, వేరొకటి కాదు"** – అని తెలియజేసే అష్టాక్షరిలోని

**“నారాయణాయ”** అనే మూడవ పదంలోని అర్థం తెలియజేయబడింది – అని యామునుల అభిప్రాయం.

– ఈ క్రమంలో, ఈ సంబోధనలు మూడు, తిరుమంత్రం (అష్టాక్షరి)లోని మూడు పదాల ద్వారా తెలుపబడే జీవుని అనన్యార్హశేషత్వ, అనన్య శరణత్వ, అనన్యభోగ్యత్వాలను తెలుపుతున్నాయి– అని శ్రీయామునుల అర్థసమన్వయం కనుక, ఈ క్రమంలో అష్టాక్షరి మహామంత్రార్థం శ్రీవేంకటేశ్వర స్వామి పరంగా సమన్వయం చేయబడినట్లు అయినది.

ఇక, ఉడైయవర్ అనుగ్రహించిన వివరణం ఈ క్రింది విధంగా సాగింది.

“ఎమ్మనా!” అని మొదట సంబోధించినందున భగవంతునివల్ల జ్ఞానాన్ని పొందిన విషయం తెలుపబడింది. “అనా” అంటే, తల్లి –అని అర్థం. తల్లి స్తన్యాన్ని ఇచ్చి, తన బిడ్డకు సత్తను కలిగించినట్లుగానే, జీవులకు తల్లి అయిన భగవానుడు వేదాది శాస్త్రప్రదానాన్ని చేసి, జ్ఞానస్తన్యాన్ని ఇచ్చి, శేషత్వ స్వరూప జ్ఞానాన్ని కలిగించి, జీవులకు సత్తను కలిగిస్తున్నాడు. శేషత్వసిద్ధి లేనిదే జీవునకు సత్త కలుగదు కదా. “**అస్తి బ్రహ్మేతి చేద్వేద సంతమేనం తతో విదుః**” (భగవానుడు ఉన్నాడు, సమస్త జీవులకు శేషియై ఉన్నాడు– అని తెలిసినవానినే విజ్ఞులు సత్తను కలిగినవానినిగా తెలుసుకుంటున్నారు) అని అన్నది వేదం కూడా.

అత్మజ్ఞానమంటే దేహాత్మవివేకం. –అది, దేహం కంటే ఆత్మవిలక్షణమనే జ్ఞానం. “**దేహమే ఆత్మ**” అనే దేహాత్మభ్రాంతిరూపజ్ఞాన విరోధి ముందుగా తీరాలి. అప్పుడు కాని ఆత్మ అచేతనం కంటే విలక్షణమనే యథార్థజ్ఞానం కలుగదు. ఇది జ్ఞానంలోని మొట్టమొదటి దశ. ఈ జ్ఞానదశను కలిగించి, దేహాత్మ భ్రాంతిని పోగొట్టి దేహం కంటే ఆత్మ వేరయినది – అనే

జ్ఞానాన్ని భగవానుడు తమకు కలిగించిన విషయాన్ని ఈ సంబోధనతో అళ్వారులు మొట్టమొదటగా తెలియజేశారు – అని శ్రీ రామానుజుల అభిప్రాయం.

ఈ విధంగా "**ఆత్మ అచేతనం కంటే విలక్షణమైనది**" అనే విషయం ప్రణవంలో ఉండే మకారం తెలుపుతున్నది. ఈ మకారం" మన –జ్ఞానే, మను – అవబోధనే" రెండు విధాలయిన ధాతువుల నుండి పుట్టే అవకాశము ఉన్నది కనుక, ఈ రెండు ధాతువుల వల్ల ఆత్మకు కల "**జ్ఞాతృత్వం, జ్ఞాన స్వరూపత్వం**" అనే ధర్మాలు తెలుపబడుతున్నందున, ఈ రెండు ధర్మాలు అచేతన పదార్థానికి లేవు, కనుక, ఆత్మ అచేతనంగ కంటే విలక్షణమైనది– అని తెలియజేసే ప్రకృత సంబోధన, ప్రణవంలో చివరి ఉండే మకారంలోని తాత్పర్యాన్ని తెలుపుతున్నది– అనేది రామానుజుల అర్థ నిర్వాహం.

"**దేహమే ఆత్మ**" అని భావించడం విపరీత జ్ఞానం అనబడుతుంది. దీనికే శాస్త్రంలో ధర్మివిపర్యాసం అని పేరు. చేతనాచేతనాలు రెండు వేరు వేరు ధర్మిపదార్థాలు అనే జ్ఞానం ముందు కలగాలి. ధర్మి సిద్ధిస్తే కదా, దానిలో ఉండే ధర్మాలను గూర్చి విచారణ చేసే ఆవశ్యకత, అవకాశం కలుగుతుంది. "సతి ధర్మిణి, ధర్మాః చింత్యంతే" (ధర్మి అనేది ఒకటి ఉన్నదని సిద్ధిస్తే, ఆ తరువాత ఆ ధర్మిలో ఏ ధర్మాలు ఉన్నాయి? అనే విచారణ చేయబడుతుంది) అనేది కదా శాస్త్రక్రమం. "**సతి కుడ్యే చిత్రకర్మ**". మొదట గోడ అనేది ఉంటే, అప్పుడు కదా దానిపై చిత్తరువును గీయడం సాధ్యం అవుతుంది. ఈ కారణంవల్లనే శ్రీపరాశర భట్టర్ కూడా, శ్రీరంగరాజస్తవం ఉత్తర శతకంలో, ఆరంభంలో పరమత నిరసనాన్ని చేసేటప్పుడు, ముందుగా ధర్మిని నిరాకరించే చార్వాక మతనిరసనను చేసి ధర్మిస్థాపనను చేశారు. ఆ తరువాత ఆ ధర్మిలో ఉండే ధర్మాలనుగూర్చి వాదించే వేరు వేరు అవైదిక మతాలను నిరసించారు. శ్రీరామానుజులు శ్రీభాష్యంలో చార్వాక మత ప్రస్తావనను చేయకపోవడానికి

కారణం, శారీరకమీమాంసలో ఆ మతప్రస్తావన లేకపోవడమేకదా. అందువల్ల, శాస్త్రక్రమంలోను, "**ఇదమిత్థమ్**" (ఈ వస్తువు ఇటువంటిది) అనే జ్ఞానావరోహణక్రమంలోను, గమనించి చూచినప్పుడు, జ్ఞానంలో మొదటి మెట్టు అయిన విపరీత జ్ఞాననిరసనం జరగాలి. ఇదం అనే పదార్థం సిద్ధించాలి. ప్రకారి సిద్ధించాలి. అది మొదటి సంబోధనతో జరిగింది. ఇప్పుడు "**ఇత్థమ్**" అనే ప్రకారజ్ఞానం నిశ్చయింపబడుతున్నది. ప్రకారానికి సంబంధించిన అయథార్థజ్ఞానం విపరీత జ్ఞానం. ఆ విపరీతజ్ఞానాన్ని భగవానుడు తొలగించిన రెండు దశలను ఆళ్వారులు తర్వాత ఉండే ఈ రెండు సంబోధనతో తెలియజేశారు –అని శ్రీరామానుజుల అభిప్రాయం.

ఇప్పుడు, "**ఆత్మ ప్రత్యేకమైన ధర్మి**" అనే జ్ఞానం కలిగింది. ఇక, సాధారణంగా కలిగిన ఈ ధర్మిజ్ఞానంలో విశేషపర్యవసానం ఏర్పడాలి. అప్పుడే అది నిష్కృతమైన జ్ఞానం అవుతుంది. అది కలిగిన విషయాన్ని మిగిలిన రెండు సంబోధనలు తెలుపుతున్నాయి– అనేది శ్రీరామానుజుల అభిప్రాయం.

"**జ్ఞానానందమయ స్త్వాత్మా శేషో హి పరమాత్మనః**" (జ్ఞానమయుడు, ఆనందమయుడు అయిన ఈ ఆత్మ అయితే, పరమాత్మకు శేషం కదా)అని శాస్త్రం ఆత్మలక్షణాన్ని చెబుతున్నది. ఈ లక్షణంలో, ఇంతవరకు, మొదటి సగం మొట్టమొదటి సంబోధన ద్వారా తెలియజేయబడింది. ఇక, ఈ లక్షణంలో ఉండే రెండవ సగం, తర్వాత ఉండే రెండు సంబోధనలతో తెలుపబడుతున్నది.

"**ఎన్ కులదైవమే!**" అని ఆళ్వారుల. రెండవ **సంబోధన**. "**నా కులానికి దైవమా!!**" అని దీని అర్థం. నా కులానికి అంతటికి అద్వితీయ దైవమనే ఈ అర్థం ద్వారా, జీవుడు వేరొకరికి శేషమై ఉండడమనే అన్యశేషత్వరూపమైన విరోధి కొంత తొలగిన విషయం దీనివల్ల సూచింపబడింది.

ప్రణవంలో ఉండే, లుప్తచతుర్థితో కూడిన అకారంద్వారా చేతనుడు భగవంతునకు శేషం అనే అర్థం తెలియజేయబడుతున్నది. ప్రణవంలో మొదట ఉండే ఆకారం పై వచ్చి లోపించిన చతుర్థి తాదర్థ్యే చతుర్థి కనుక, అది నిర్విశేషణంగా చెప్పబడింది కనుక, అంటే, వీటిని మాత్రమే, అకారంచేత చెప్పబడే భగవానుడు శేషంగా కలిగినవాడు – అని చెప్పబడనందున, అకారంచేత చెప్పబడే శ్రీమన్నారాయణుని కొరకు మ చేతనా చేతనాలు అనే మిగిలిన రెండు తత్వాలు ఉన్నాయి– అనే అర్థం ఏర్పడుతున్నది. ప్రస్తుతంలో ఆత్మస్వరూపం అనేది విషయం కనుక, ఆత్మలన్నీ భగవానునకు శేషం– అని అకారంచేత చెప్పబడే ఈ ఆత్మకు సంబంధించిన రెండవ లక్షణం ఆళ్వార్లు చేసిన రెండవ సంబోధన ద్వారా తెలియజేయబడుతున్నదని శ్రీరామానుజుల అర్థసమన్వయం.

ఒక వస్తువునకు కల ధర్మాల విషయంలో అతద్రూపమైన జ్ఞానానికి అన్యథా జ్ఞానం అని పేరు. "ఆత్మ దేహం కంటే విలక్షణమై ఉన్నది" అని తెలిసినా, అది స్వతంత్రమనే జ్ఞానం కలిగితే, అది సరి అయిన జ్ఞానం కాదు ఆత్మ భగవానునకు శేషం– జ్ఞానం కలిగినప్పుడే, అన్యథాజ్ఞానం అనే దోషం తీరుతుంది. "ఆత్మ స్వతంత్రం కాదు, భగవానునకు శేషం" అని తెలిపే ఈ రెండవ సంబోధన ద్వారా ఆత్మకు సంబంధించిన అన్యథాజ్ఞానం అనే, ఒక విధమైన జ్ఞానదోషం తీరినట్లు అయినది. అందువల్ల, ఇది ప్రణవంలోని లుప్తచతుర్థిద్వారా చెప్పబడే, అన్యాశేషత్వ విరోధినిరసనాన్ని సూచిస్తున్నది– అని శ్రీరామానుజుల అభిప్రాయం.

అష్టాక్షరిలో చెప్పబడే నవవిధసంబంధాలతో, అకారం పై వచ్చి లోపించిన చతుర్థీవిభక్తి జీవపరమాత్మల మధ్య ఉండే శేష– శేషి భావాన్ని తెలుపుతున్నదని **"నవవిధసంబంధమ్"** అనే రహస్యగ్రంథంలో శ్రీపిళ్లైలోకాచార్యులవారు అనుగ్రహించడాన్ని ఇక్కడ స్మరించాలి.

ఇంతకు ముందు, మొదటి సంబోధన ద్వారా విపరీత జ్ఞానం తీరింది. అంటే, ఆత్మ లక్షణ విషయంలో శుక్తిరజత భ్రాంతివంటి భ్రాంతి తీరింది. ఇప్పుడు అన్యథాజ్ఞానం రెండవ సంబోధనతో కొంత తీరింది. అంటే, రజ్జుసర్ప భ్రాంతివంటి భ్రాంతి కొంత తీరింది.

ఆత్మకు సంబంధించిన అన్యథాజ్ఞానం ఇంతటితో పూర్తిగా తీరలేదు. "**భగవానునకు జీవుడు శేషం**" అనే జ్ఞానం ఏర్పడినప్పటికీ "ఆత్మ భగవానునకు మాత్రమే శేషం" అనే నిష్కృష్ట జ్ఞానం ఇంకా కలుగలేదుకదా. ఎందుకంటే ఆత్మ జ్ఞాత కనుక, దానివల్ల కర్తృత్వం, దానివల్ల భోక్తృత్వం అనేవి వెనువెంటనే సిద్ధిస్తాయి. ఇవి, "నేను స్వతంత్రుడను, నేను జ్ఞాతను, నేను కర్తను, నేను భక్తను" అనే భావనలను జీవునకు కలిగిస్తాయి. "భగవానునకు నేను శేషం అయితే కావచ్చు కాక, నాకు కూడా నేను శేషమే, నేను జ్ఞాతను, కర్తను, భోక్తను కదా" అనే జ్ఞాన దోషం కలిగే అవకాశం ఎక్కువగా ఉన్నది. ఇది చాలా బలమైన దోషం, అనివార్యమైన దోషం. ఈ దోషం తీరితే తప్ప ఆత్మకు సంబంధించిన జ్ఞానం పూర్ణం కాదు, దోషరహితం కాదు. "నాకు నేను శేషం" అనే ఈ జ్ఞానదోషాన్ని అళ్వార్లు చేసిన మూడవ సంబోధన తీరుస్తున్నది– అని శ్రీరామానుజుల అభిప్రాయం.

"ఎన్నుడై నాయకనే!" అనేది మూడవ సంబోధన. అంటే, "నాకు నాయకుడా!" అని అర్థం. దీనివల్ల " భగవానుడే నాకు యజమాని" అనే జ్ఞానం ఏర్పడుతున్నది. "నయతి ఇతి నాయకః– నడిపించేవాడు నాయకుడు " అనే అర్థాన్ని ఇచ్చే ఈ నాయక పదం వల్ల, "నేను జ్ఞాతను అయినా, కర్తను అయినా, భోక్తను అయినా, నా జ్ఞాతృత్వ కర్తృత్వ, భోక్తృత్వాలు అన్నీ భగవంతుని అధీనంలో ఉన్నవి, వాటిని నడిపేవాడు అతడే" అనే అర్థాన్ని ఈ సంబోధన తెలుపుతున్నది. ఇందువల్ల, "ఆత్మ పరమాత్మకు మాత్రమే శేషం, నాకు తాను స్వతంత్రం కాదు, ఆత్మకు కల జ్ఞాతృత్వకర్తృత్వభోక్తృత్వాలు అన్నీ

భగవంతుని అధీనంలో ఉన్నవే" – అని సిద్ధిస్తున్నందువల్ల, రెండవ అన్యథాజ్ఞానం అనే దోషం కూడా తీరినది. స్వస్వాతంత్ర్యం అనే విరోధి తీరినది. ఆత్మకు సంబంధించిన జ్ఞానం నిష్కృష్టంగా ఇంతటితో ఏర్పడింది.

ప్రణవంలో ఈ అర్థం, అవధారణను తెలిపే ఉకారం ద్వారా చెప్పబడింది. అందచేత ఆళ్వారులు చేసిన మూడవ సంబోధనద్వారా తెలియబడుతున్న అర్థం ప్రణవంలో ఉకారంచేత చెప్పబడే అర్థం –అనేది ఇక్కడ స్పష్టం అవుతున్నది.

ఈ విధంగా చూసినప్పుడు శ్రీ రామానుజులు మూడు సంబోధనలకు తెలిపిన అర్థాలు ప్రణవంలో ఉండే మూడు అక్షరాల ద్వారా తెలుపబడే అర్థాలే కనుక, శ్రీరామానుజులు ప్రణవార్థాన్ని శ్రీవేంకటేశ్వరుని విషయంగా సమన్వయించి పలికారు అని తెలుస్తున్నది.

చివరిగా, ఒక విషయం,

శ్రీయామునుల అర్థనిర్వాహంలో, అష్టాక్షరిలో ఉండే మూడు పదాల క్రమాన్ని అనుసరించి ఆళ్వారుల సంబోధనలలోని అర్థం సమన్వయింపబడింది. కానీ, శ్రీరామానుజుల అర్థసమన్వయంలో అటువంటి క్రమం కనబడడం లేదే. ప్రణవంలో ఉండే అక్షరాల క్రమంలో అర్థ సమన్వయం కనబడడం లేదు. ముందు మకారార్థం, తరువాత అకారార్థం, తరువాత ఉకారార్థం– అనే క్రమంలో అర్థం ప్రతిపాదింపబడినట్లుగా రామానుజుల సమన్వయం కనబడుతూ ఉన్నది కదా. మరి, క్రమవివక్ష శ్రీయామునుల సమన్వయంలో ఉన్నట్లుగా రామానుజుల సమన్వయంలో ఎందుకు లేదు? అనే సందేహం ఇక్కడ కలుగవచ్చు.

అర్థప్రాధాన్యాన్ని బట్టి, పదాల క్రమాన్ని అనుసరించకుండా, వేరొక క్రమంలో అర్థాన్ని సమన్వయించి చెప్పడంలో ఏ విధమైన లోటు లేదు. అది

శాస్త్రీయం కూడా, వైదికం కూడా. "అభ్యర్హితం పూర్వమ్" అనే క్రమం కూడా శాస్త్రసిద్ధమే. ఆది ప్రకృత సందర్భానికి తగి ఉన్నప్పుడు, దోషం కాదు. ప్రణవంలో ఉండే అక్షరాల అర్థాన్ని వివరించే ప్రణవశేషం కూడా, ముందు ఉకారాన్ని, ఆ తరువాత అకారాన్ని, ఆ తరువాత మకారాన్ని వివరించినది కదా. అందుచేత, అర్థ ప్రాధాన్యాన్నిబట్టి, పదాల క్రమాన్ని అనుసరించకుండా, అర్థాన్ని అనుసరించి పదాలను సమన్వయించడం వైదిక క్రమమే. శబ్దం అర్థాన్ని కదా అనుసరిస్తుంది. అర్థస్వరూపుడైన భగవానుని అనుసరించి కదా పదాలు అన్ని వర్తిస్తాయి.

ఈ శ్రీరామానుజుల అర్థనిర్వాహం, శ్రీరామానుజులకు ద్రావిడభాషలో పాండిత్యం లేదని వాదించేవారికి తగిన బదులుకదా!

ఇటువంటి అద్భుతమైన, శాస్త్రీయమైన పదప్రయోగాలను చేయడం అళ్వారులవంటి పరమవైదికులకు, విశుద్ధ తత్వజ్ఞానభక్తులను కల మహనీయులకే సాధ్యం, వాటిని అందంగా, మధుర మనోజ్ఞంగా సమన్వయించి వివరించడం శ్రీయామునుల, శ్రీరామానుజులవంటి మహాచార్యులకే సాధ్యం— ఇతి శమ్.

★★★★★

# పంపాతీరంలోని రక్షకుడు

★★★★★

శ్రీరాముడు హనుమంతుని సీతాదేవి దగ్గరకు దూతగా పంపించాడు. వానరసేనలో ఎంతోమంది వానరులు ఉన్నారు. వారిలో కొంతమందిని తూర్పుదిక్కుకు, మరి కొంతమందిని దక్షిణ దిక్కుకు, మరి కొంతమందిని పడమటి దిక్కుకు, ఇంకా కొంతమందిని ఉత్తర దిక్కు సీతను అన్వేషించడం కోసం శ్రీరాముడు పంపించాడు. ఆ క్రమంలో హనుమంతుని దక్షిణ దిక్కుకు వెళ్లే వానర సేనలో ఒకనిగా పంపించాడు. అతనిని పంపించేటప్పుడు, తన గుర్తుగా తన అంగుళీయకాన్ని హనుమంతునకు శ్రీరాముడు ఇచ్చాడు. కానీ, మిగిలిన మూడు దిక్కులలో పంపబడిన వానరసేనలో ఉండే ఎవ్వరికి అంగుళీయకాన్ని శ్రీరాముడు ఇవ్వలేదు. అంతకుముందే జటాయువు చెప్పిన కొన్ని మాటల వల్ల, రావణుడు సీతను దక్షిణ దిక్కులో ఉండే లంక నగరం వైపు తీసుకొని పోయాడు – అనే విషయం శ్రీరామునకు తెలిసింది. అందువల్ల శ్రీరాముడు దక్షిణాదిక్కుకు సీత జాడను తెలుసుకోవడం కోసం వెళ్లే వానరసేనలో ఉండే హనుమంతునకు తన గుర్తుగా తన చేతి ఉంగరాన్ని శ్రీరాముడు ఇచ్చాడు.

దక్షిణ దిక్కుకు వెళ్ళిన వానరసేనలో హనుమంతుడు ఒక్కడు మాత్రం దక్షిణ సముద్రాన్ని దాటగలిగాడు. సీతను చూడగలిగాడు. శ్రీరాముడు ఇచ్చిన గుర్తు అయిన అంగుళీయకాన్ని ఆమెకు ఇచ్చాడు.

తన దగ్గరకు శ్రీరాముడు సందేశాన్ని పంపించినట్లుగానే, సీతకుకూడా శ్రీరాముని వద్దకు సందేశాన్ని పంపించాలనే ఆశ ఉన్నది. అయితే, శ్రీరాముడు హనుమంతుని తన దగ్గరకు దూతగా పంపించినట్లుగా, లంకానగరం నుండి ఎవరిని సీతాదేవి తన దూతగా శ్రీరాముని దగ్గరకు పంపించే అవకాశం లేదు. తన దగ్గరకు దూతగా వచ్చిన హనుమంతుని

మాత్రమే శ్రీరాముని దగ్గరకు దూతగా కూడా పంపించే అవకాశం ఆమెకు ఏర్పడింది.

ఈ విధంగా హనుమంతుని తన దూతగా శ్రీరాముని దగ్గరకు సీత పంపించిన హనుమంతుడు ఎక్కడ నివసించేవాడు?. పంపాసరస్సు తీరంలో నివసించేవాడు. పంపా సరోవరం అనేది ఒక అందమైన సరస్సు. ఇది కర్ణాటక రాష్ట్రంలోని హంపికి దగ్గరలో ఉన్నది. ఆ సరస్సు తీరంలోనే శ్రీరాముడు నివసించాడు. శ్రీరాముడు హనుమంతుని దూతగా పంపించిన కార్యం సఫలమైనది. అతని ద్వారా సీతాదేవి పంపించిన చూడామణిని శ్రీరాముడు గ్రహించాడు. సాక్షాత్తు ఆమెను చూసినట్లుగానే భావించి, ఆర్తితో కన్నీరు విడిచాడు. సీతను కాపాడడం కోసం వానరసేనను సమాయత్తం చేసి, సముద్రాన్ని దాటి, లంకలో ప్రవేశించి, రావణుని వధించి, సీతను రక్షించాడు ఈ కథ అందరికీ తెలిసిన విషయమే.

ఈ విధంగా పంపాసరోవరతీరంలో హనుమంతుని సీతాదేవి భగవంతుడైన శ్రీ రాముని దగ్గర దూతగా పంపించిన వృత్తాంతం శ్రీరామాయణంలోనిది. ఈ సంఘటన అంతా త్రేతాయుగంలో జరిగింది.

ఆ తరువాత ద్వాపర యుగం గడిచింది. కలియుగం కూడా ఆరంభమైనది. కలియుగం ఆరంభంలో నమ్మాళ్వార్ల అవతారం సంభవించింది, పంపా సరోవర తీరవాసి అయిన హనుమంతుని తన దూతగా శ్రీరాముడు సీతాదేవి దగ్గరకు పంపించిన రామాయణ గాథను తెలుసుకున్నారు.

ఆ శ్రీరాముడే ఇప్పుడు, కలియుగంలో, వేరొక పంపా అనే పేరును కలిగిన నదీ తీరంలో అర్చామూర్తిగా నెలకొని ఉన్నాడు. ఈ నది కేరళదేశంలో ఉన్నది. ఆ నదీతీరంలో తిరువణ్ వండూర్ అనే ఒక దివ్య క్షేత్రం ఉన్నది. ఆ క్షేత్రంలో శ్రీరాముడు అర్చా రూపంలో వేంచేసి ఉన్నాడు. ఈ క్షేత్రం

మలయాళ దివ్యదేశాలలో ఉండే పదమూడు క్షేత్రాలలో ఒకటి. ఈ స్వామి దగ్గరకు నమ్మాళ్వార్లు తమ సందేశాన్ని పంపించారు. "తేరై నీర్ పంబై వడపాలై త్తిరువణ్ వండూర్ మాటిల్ పోరక్కన్ మదిళ్ నీఱెళ్ల చ్చెత్తు ఉగంద ఏఱు శేవగనాఱ్కు ఎన్నైయుమ్ ఉళళ్ ఎన్మింగళ్"(సాటి లేని యుద్ధాన్ని చేయగలిగినవాడైన రాక్షసుడు, రావణుడు పాలించే లంకా నగరాన్ని ప్రాకారాలతోపాటు భస్మం అయ్యేటట్లు చేసి, సీతాదేవిని రక్షించి, ఆనందించిన సాటి లేని పరాక్రమశాలి అయిన శ్రీరామునితో "ఈ పరాంకుశ నాయిక కూడా ఒకతె నీ చేత రక్షింపబడవలసినది ఉన్నది"– అని చెప్పండి) అనే సందేశాన్ని తిరువాయ్ మొళి దివ్య ప్రబంధంలోని ఒక దశకంలో పంపించారు.

"ఆనాడు సీతను రక్షించడం కోసం లంకా నగరానికి వెళ్లి, ఆ లంకను భస్మం చేసి, దానిని పాలించే రావణుని సంహరించి సీతను రక్షించిన శ్రీరాముడే ఇప్పుడు పంపానదీతీరంలో ఉండే దివ్య క్షేత్రంలో నెలకొని ఉన్నాడు. ఓ పక్షులారా! మీరు ఆ స్వామి దగ్గరకు నా దూతగా వెళ్లండి" అని కొన్ని పక్షులను స్వామి దగ్గరకు దూతలుగా నమ్మాళ్వారులు పంపించారు.

నమ్మాళ్వారులు ఈ సందేశాన్ని పరాంకుశ నాయకీ భావంతో పంపిస్తున్నారు. వారికి తమ సందేశాన్ని పంపించటానికి హనుమంతుని వంటి వానరులు ఎవరూ లభించలేదు. అందువల్ల పక్షులను కొన్నిటిని తమ దూతలుగా భగవంతుని దగ్గరకు పంపిస్తున్నారు. అందుచేత, నమ్మాళ్వారులకు తమ దూతలుగా పంపించడానికి పక్షులే లభించాయి. క్రౌంచపక్షి, పిచ్చుకలు, హంసలు, కోయిలలు, తుమ్మెదల, నీటి కొంగలు మొదలైన పక్షులే వారికి దూతలు అయ్యాయి.

ఆళ్వార్లకు ఏమి నమ్మకం అంటే, పంపానదీతిరంలో ఉండే శ్రీరాముడు తప్పక తమను కాపాడతాడు –అని. ఎందుకంటే, అతడు భక్తులను రక్షించే స్వభావాన్ని కలవాడు కనుక. ఈ విషయం సీతాదేవి పట్ల

ఋజువైనది. ఆ స్వామిలో ఉండే ఈ గుణాన్ని చూచి కదా, నమ్మి కదా సీతాదేవి హనుమంతుని తన దూతగా శ్రీరాముని దగ్గరకు పంపించినది. అదే రీతిలో, ఆళ్వార్లుకూడా ఆ శ్రీరాముని దగ్గరకు పక్షులను తమ దూతలుగా పంపించారు. "కోకిలలారా! హంసలారా! తుమ్మెదలారా! మీరు నా దూతలుగా శ్రీరాముని దగ్గరకు వెళ్ళండి. ఇంకా నీ చేత రక్షింపబడవలసిన ఒకతె పరాంకుశ నాయక ఉన్నది – అని స్వామితో చెప్పండి. ఆమె నీ రాక కోసం కాచుకుని ఉన్నది అని చెప్పండి" అని అంటూ పక్షులను దూతలుగా పంపించారు ఆళ్వారులు.

ఇదేవిధంగా కదా, సీతాదేవి కూడా, శ్రీరాముని దగ్గరకు తన సందేశాన్ని పంపించింది. "శ్రీరాముడు జగద్రక్షకుడు. అతడు, ఆ విధంగా అందరినీ రక్షించే స్వభావాన్ని కలిగినవాడైనప్పుడు, ఆ స్వామి నన్ను మాత్రం రక్షించకుండా ఎందుకోసం విడిచి పెట్టాడు? వెంటనే వచ్చి నన్ను రక్షించమని ఆ స్వామితో చెప్పు" అని హనుమంతునితో సీతాదేవి తన సందేశాన్ని పంపించింది.

నమ్మాళ్వారులు తమను సీతాదేవిగా భావించారు కాబోలు. సీతాదేవి చెప్పినట్లుగానే, "నేను కూడా రక్షింపబడవలసినదానను ఒకటేన ఉన్నాను– అని స్వామితో చెప్పండి" అనే సందేశాన్ని పంపానదీ తీరంలో ఆర్చారూపంలో ఉండే రాముని దగ్గరకు తన సందేశాన్ని పంపించిందినది.

సీతాదేవి పంపిన సందేశాన్ని విన్న శ్రీరాముడు వానరసైన్యాన్ని తీసుకొని లంకకు వచ్చి, సీతాదేవిని రక్షించాడు. ఇప్పుడు పరాంకుశనాయకిని రక్షించడం కోసం ఆ విధంగా వానర సైన్యాన్ని దేనిని తీసుకొని రావలసిన అక్కర శ్రీరామునకు లేదు. ఇక్కడ ఏ రాక్షస సైన్యం లేదు, రావణుడు లేడు, లంక లేదు. పరాంకుశ నాయకి పంపిన సందేశాన్ని విని, స్వామి, "నేను తప్పక వస్తాను, ఆమెను స్వీకరిస్తాను" అని అంటే చాలు, ఆమె ఆశపడినట్లుగానే

భగవానుడు తన ప్రతివచనాన్ని పంపగా పరాంకుశ నాయిక తృప్తిని పొందింది.

ఈ రెండు సందర్భాలను గమనిస్తే, ఒక అందమైన సామ్యం కనిపిస్తుంది. సీతాదేవి పంపానది సరస్సు తీరంలో ఉండే హనుమంతుని ద్వారా పంపించింది. ఆళ్వార్ నాయిక పంపించిన సందేశం, పంపా నదీతీరంలో ఉండే పక్షుల ద్వారా పంపించింది.

ఒకటి నది, ఇంకొకటి సరస్సు. ఈ రెండు పంపా అనే పేరు కలిగినవే. కానీ, ఇవి ఉండే ప్రదేశాలు వేరు వేరు. ఒకటి హంపికి దగ్గరలో ఉండగా, వేరొకటి కేరళ దేశంలో ఉన్నది. ఈ రెండిటి తీరంలో ఉండేవాడు శ్రీరాముడే అయితే ఒక మూర్తి విభవమూర్తి, వేరొక మూర్తి అర్చా మూర్తి. ఈ రెండు రూపాలు ధర్మి ఐక్యంతో ఒకటే ఈ ఇద్దరూ ఆశ్రిత రక్షణ తత్పరతను కలవారే. ఈ స్వామికి కల ఈ స్వభావాన్ని మనం మనసులో దృఢంగా నమ్మి, ఆ స్వామిని ఆశ్రయించి ప్రార్థిస్తే, తప్పక రక్షిస్తాడు. తనను శరణు కోరిన వారిని ఏనాడు విడచిపెట్టడు.

ఇది నమ్మాళ్వారుల ఏనాటికి సడలిపోని నమ్మిక.

ఆ స్వామిని మనం ఏమని ప్రార్థిస్తాము? నీ భక్తులమైన మమ్ములను రక్షించాలి అని? ఏ విధంగా రక్షించాలి? అని అంటే, సరి అయిన జ్ఞానాన్ని, భక్తిని మనకుష ప్రసాదించి రక్షించమని మనం వేడుకుంటాము. “ఞాన క్కై దా, కాలక్కழிవు శెయ్యేలే”– జ్ఞానం అనే చేతిని మాకు ప్రసాదించు ఆలస్యం చేయవద్దు – అని ఆళ్వారులు ప్రార్ధించినట్టుగా, ప్రార్థిస్తాము. మనకు భగవంతుడు సరి అయిన జ్ఞానాన్ని ప్రసాదిస్తున్నాడు– అని అంటే, మనలను అతడు రక్షిస్తున్నాడు – అని అర్థం ఆ ప్రార్థనను మనం పంపానదీ తీరంలో ఉండే తిరువణ్ వండూర్ క్షేత్రంలో వేంచేసి ఉన్న శ్రీరాముని సన్నిధిలో చేయవచ్చు కదా. చేద్దాం రండి.

సీతాదేవిని, నమ్మాళ్వారులను రక్షించినట్లుగా, ఆ స్వామి మనలను కూడా తప్పక రక్షిస్తాడు.

★★★★

**పూర్వాచార్యైః నిత్యసత్యార్థవాక్యైః**
**ఉక్తానర్థా నాత్మరక్షైకలక్ష్యాన్,**
**ఉద్దిశ్యేయం వ్యాసమాలా ప్రవృత్తా**
**దద్యాన్మోదం భక్తవర్యాంతరంగే.**

నిత్యం సత్యమైన అర్థాలను తెలిపే వాక్యాలను అనుగ్రహించే పూర్వాచార్యుల చేత అనుగ్రహింపబడిన, ఆత్మరక్షణను అద్వితీయ లక్ష్యంగా కలిగిన అర్థాలను ఉద్దేశించి ఈ వ్యాసమాలిక రచింపబడింది. ఇది భక్తవర్యుల మనసులకు ఆనందాన్ని కలిగించాలి.

